## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120004126

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గీతా ముచ్చట్లు

రచయిత :

విద్యాప్రకాశనందగిరి స్వాములవారు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి - 517 640

1995

# విషయసూచిక

Page No.

## తొలిపలుకులు

శ్రీ కాళహస్తి యందలి శ్రీశుకబ్రహ్మాశ్రమము యొక్క స్థాపకులను, గీతామకరందాది గ్రంథరచయితలను అగు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములువారు "గీతాముచ్చట్లు" అను ఈ చిన్ని పుస్తకమును రచించిరి. భగవద్గీత యందలి నిగూఢతత్త్వములు జనసామాన్యమునకు చక్కగ బోధపడుటకై సులభమైన వ్యావహారిక భాషలో శ్రీ స్వాములవారు ఈ గ్రంథమును వ్రాసిరి. జనులు ఇద్దానిని పఠించి శ్రీకృష్ణపరమాత్మ యొక్క దివ్యబోధలను చక్కగ హృదయస్థము చేసుకొని ఆచరించి తరించుదురు గాక !

ఓమ్ ఇట్లు ప్రకాశకులు.

## గీతాప్రార్థన

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మమ్బత్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.

స్వయముగ భగవంతుడగు నారాయణునిచే అర్జునునకు బోధింపబడినట్టియు, ప్రాచీన మహర్షియగు వేదవ్యాసమునీంద్రునిచే మహాభారతమధ్యమున కూర్చబడినట్టియు, అద్వైతజ్ఞానమను అమృతమును వర్షించునట్టియు, పదునెనిమిది అధ్యాయములతో గూడినట్టియు, సంసారబంధముల నుండి విముక్తిని కలిగించునట్టియు ఓ తల్లీ! భగవద్గీతా ! నిన్ను నేను ధ్యానించుచున్నాను.

## ఓ చిత్తమా!

చేతోభృఙ్గ భ్రమసి వృథా
భవమరుభూమౌ విరసాయామ్
పిబపిబ గీతామకరన్దం
యదుపతిముఖకమలభవాఢ్యమ్.

మనస్సను ఓ తుమ్మెదా ! రసహీనమగు ఈ సంసార మరుభూమి యందేల వ్యర్థముగ సంచరించుచున్నావు? (ఇక ఆ సంచారమును కట్టిపెట్టి) శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖ పద్మమునుండి బయలు వెడలిన శ్రేష్ఠమగు గీతామకరందమును పానము చేయుము !

## దైవ ప్రార్థన

కరుణామూర్తియగు దేవా !

మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును మీ పాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుడు.

పరమ దయానిధీ !

ప్రాతః కాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండు వఱకును మనోవాక్కాయములచే మా వలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుడు.

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా !

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్ట సంకల్పముగాని విషయవాసన గాని, అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుడు.

వేదాంత వేద్యా ! అభయ స్వరూపా !

మాయందు భక్తి జ్ఞాన వైరాగ్యబీజము లంకురించి శీఘ్రముగా ప్రవృద్ధము లగునట్లు ఆశీర్వదింపుడు. మఱియు ఈ జన్మమునందే కడతేరి మీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుడు.

దేవా !

మీరు భక్తవత్సలురు. దీనులపాలిట కల్పవృక్ష స్వరూపులు. మీరు తప్ప మాకింకెవరు దిక్కు? మిమ్ములను ఆశ్రయించితిమి. అసత్తునుండ సత్తునకు గొనిపొండు. తమస్సు నుండి జ్యోతిలోనికి తీసుకొనిపొండు. మృత్యువు నుండి అమృతత్వమును పొందింపజే యుడు. ఇదే మా వినతి. అనుగ్రహింపుడు. మీ దరి జేర్చుకొనుడు. పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి.

[ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమముతప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునప్పుడును మనస్ఫూర్తిగా పఠించుదురో, అట్టివారికి జీవితమునందేలాటి దోషము లున్నను కలుగకుండుటయేగాక సర్వేశ్వరునియొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులుకాగలరు.]

# గీతాదేవి స్తుతి

*తల్లీ! గీతాదేవీ! జగన్మాతా! చిన్మయస్వరూపిణీ!* సంసారఘోరారణ్యమున దరిగానక తల్లడిల్లుచున్న మాకు మీరు దిక్కు చూపి మార్గమును ప్రసాదించితిరి. మాయొక్క భీకర సాంసారిక సంకటములను, తాపత్రయములను అంతమొనర్చుటకై మీరు కృతనిశ్చయులైతిరి. కోట్లకొలది జన్మలు అజ్ఞాననిబిడాంధకారమున మ్రగ్గియున్నను సుకృతవశమున ఈ జన్మయందు మీ సేవాభాగ్యమును పొందగల్గుటచే మా హృదయము ఆనందముతో నుప్పొంగుచున్నది. మీ కృపాకటాక్షవీక్షణముచే జనులందు జ్ఞానతేజ మావిర్భవించుటచే అవిద్య పటాపంచలై పోవుచున్నది. సంసారతిమిరము అంతమగుచున్నది. అంధకారబంధురమైన ఈ ప్రాపంచిక క్షేత్రమున మీరు మాకు వెలుగు చూపితివి. తల్లీ! నీ ఋణమును మేమెట్లు తీర్చుకొనగలము? మీకు మా అనంతకోటి ప్రణామములు.

*గీతాంబికే!* శ్రీకృష్ణపరమాత్మ తమ యవతారమును చాలించి వైకుంఠమునకు వెడలిపోవు సమయమున మిమ్ము మాకు చూపించిపోయిరి. కావున మీరు కృష్ణ ప్రతినిధులు. కాదుకాదు సాక్షాత్ కృష్ణస్వరూపులే. అట్టి ఓ గీతాదేవీ! మీరే మాకు శరణ్యము! మా హార్దికనమోవాకములను అందుకొనుడు.

జ్ఞానదాత్రీ! తన్ను సృష్టించిన ఈశ్వరుని తనకు బోధించిన శాస్త్రమును, తన్నుద్ధరించిన అనుష్ఠానమును ఏ కాలమందును మఱువరాదని శిష్టులవాక్యము. కావున అమోఘబోధలచే మమ్ముల నుద్ధరించుటకు బూనుకొనిన మిమ్ము సదా స్మృతిపథమున నుంచుకొనుట మాయొక్క కర్తవ్యము. విధ్యుక్తధర్మము!

స్వారాజ్యప్రదాయినీ ! ఒక జాతినిగాని, ఒక మతమునుగాని,

ఒక సంప్రదాయమునుగాని దూషింపక, సర్వసమన్వయ పద్ధతిలో మీరు మాకు బోధ సల్పితిరి. పాపులున్ను, దురాచారపరులున్ను ఏనాడైనను పుణ్యాత్ములు కాగలరని డంకా మ్రోగించి చెప్పితిరి. నిరాశానిస్పృహులకు ధైర్యసంఛార మొనర్చితిరి. జగజ్జననీ! మీరు చేసిన మేలును మేమెట్లు మఱువగలము? మీ దివ్యబోధనంను విస్మరింపకుండులాగున యనుగ్రహింపుదు. మీ యనుంగు బిడ్డలమగు మమ్ము దరికిజేర్చి దీవింపుదు!!

దీనజనోద్ధారిణీ ! మీ భవ్య సమదుపదేశములు మా హృద యాంతరాళమున ప్రవేశించి జన్మాంతర దుస్సంస్కారములను రూపుమాపి జ్ఞానోదయము కలిగించు లాగున కటాక్షింపుదు. పతితు లను, దీనులను, అర్తులను, అనాధులను, సంసారపంకపరిమగ్నులను ఉద్ధరించుటకు కంకణము గట్టుకొనిన ఓ దేవీ! జగద్ధాత్రీ! అష్టాదశాధ్యాయినీ ! అంబికే ! మీకివే మా జోహారులు ! ఆదరింపుదు !!

భగవన్ముఖారవింద సంజనిత జ్ఞాన గంగాస్వరూపిణివగు ఓ తల్లీ! సర్వోపనిషత్సార రూపిణీ ! భవసాగరమున మునుకలిడు చున్న మాకు మీరు నావవంటి వారు. మిమ్ము ఆశ్రయించితిమి. తీరమునకు జేర్చుము. భక్తి జ్ఞాన వైరాగ్యాది మోక్ష సాధనములు మా కబ్బునట్లాశీర్వదింపుదు. అహర్నిశములు మీసేవ యొనర్చు టకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుదు. మీ జన్మస్థానమగు శ్రీకృష్ణపరమాత్మ యొద్దకు మమ్ములను జేర్పుదు. ఇదే మా వినతి. అనుగ్రహింపుదు. మీ కృపారదృష్టిని మాపై వర్షింపుదు. పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి !

# గీతాగంగ

శ్లో॥ జాతాపి త్వం మురహరిముఖాజ్జాహ్నవీ తస్య పాదాత్
సర్వానభ్యుద్ధరతి భవతీ సాతు మగ్నాన్ విధత్తే
ప్రత్యగ్బ్రహ్మామృతరసనిధిం ప్రాప్య విశ్రామ్యసి త్వం
మాతర్గీతే జడనిధిమియం యాతి నత్వత్ప్రభావః

తా॥ ఓ గీతాదేవి ! విష్ణుభగవానుని పాదములనుండి గంగ ఉద్భవించినది. నీవో, ఆ భగవానుని ముఖమునుండి ఆవిర్భవించితివి ! (ఓహో! ఎట్టి ఔత్కృష్ట్యము నీది!) మఱియు గంగయందు పడినవారి భౌతికదేహములు నీటిలో మునిగిపోవుచున్నవి. జ్ఞానగంగయగు నీయందుపడిన వారినందఱినో, నీవు ఉద్ధరించుచున్నావు! ఇంతియేకాదు గంగా నది పోయి పోయి జడమగు ఉప్పుసముద్రమున (బంగాళా ఖాతమున) కలిసిపోవుచున్నది. గీతాగంగయగు నీవో, చైతన్యమగు ప్రత్యగాత్మయందు (బ్రహ్మానందసాగరమున) చేరి విశ్రమించుచున్నావు! ఇట్టి అనుపమ ప్రభావముగల గీతా గంగామతల్లీ! నిన్నిక దేనితో పోల్పగలము ? (గంగానది పవిత్రమైనదే కాని గీతాగంగ అంతకంటెను పవిత్రమైనదని కవి చమత్కారముగ తెలుపుచున్నాడు.)

# గీతా కల్పవృక్షము

గీతా కల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్
నానాశాస్త్ర రహస్య శాఖ మరతి క్షాంతి ప్రవాలాంకితం
కృష్ణాంఘ్రిద్వయ భక్తి పుష్పసురభిం మోక్షప్రదం
జ్ఞానినామ్.

"గీత యను కల్పవృక్షమును నేను సేవించుచున్నాను. అయ్యది భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మచే నాటబడినది. వేదవ్యాసమహర్షిచే పెంచబడినది. ఉపనిషత్తులే దాని విత్తనము. ఆత్మప్రబోధము దాని అంకురము. వివిధ శాస్త్రములు యొక్క రహస్యములు దాని కొమ్మలు. వైరాగ్యము, సహనము మున్నగు సద్గుణములు దాని చిగురుటాకులు. శ్రీకృష్ణపరమాత్మ యొక్క పాదపద్మముల యెడల భక్తి దాని పుష్పసుగంధము. మఱియు అది జ్ఞానులకు మోక్షదాయకమైనది."

## గీతను గూర్చి కొందరి అభిప్రాయములు

1. శ్రీ వివేకానందస్వామి :- గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు చెప్పినవి మాటలుకావు; జ్ఞానకళికలు. జీవితాదర్శమంతయు నొక్క క్షణములో నచట తెలిపివేయబడెను. ఉపనిషత్తులను తోటలోనుండి ఆధ్యాత్మిక సత్యము లను పుష్పములను యేర్చికూర్చిన మాలయే భగవద్గీత.

2. గాంధిమహాత్ముడు :- దుఃఖపూరితమగు వాతావరణము నందున్నను, ఆ దుఃఖము నన్నంటకుండుటకు కారణము భగవద్గీతాబోధయే.

3. తిలక్ :- ప్రపంచమునగల సాహిత్యమంతటిలోను గీతకు దీటురాగల పుస్తకము వేరొకటిలేదు. మహాప్రకాశమానమగు అమూల్యరత్నమిది. అయ్యది మనలను పరమానందపదవికి గొనిపోవు అపూర్వసాధనము.

4. శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు :- సంసారసాగర మును సులభముగ దాటుటకు భగవద్గీతను పఠించుటయు, దానియందు చెప్పినట్లు ఆచరించుటయు చాలును.

5. అరవిందయోగి :- మానవుడు తన మేధనంతను దార బోసినను గీతాజ్ఞానమును ఒకానొక అంశమును మాత్రమే తెలిసికొని, తెలుపగలడు.

6. శ్రీ శివానంద :- భారతదేశముయొక్క ఈ సర్వప్రియకావ్య మయ దార్శనిక గ్రంథములేనిచో, ఆంగ్లసాహిత్యము నిక్కముగ అపూర్ణముగనే యుండును.

7. వినోబాభావే :- నా శరీరాభివృద్ధికి తల్లిపాలు ఎంతగా ఉప యోగపడినవో, నాబుద్ధి వికాసమునకు భగవద్గీత అంతకంటె ఎక్కువగా ఉపయోగపడినది.

8. మాలవ్యా :- నాకు తెలిసినంతవరకు విశ్వవాఙ్మయమున భగవద్గీతను మించిన గ్రంథము ఇంకొకటి లేనేలేదు. అది హిందువులకేకాక సమస్త మానవకోటికిని ధర్మభాండాగారమై యున్నది.

9. ఎడ్విన్ ఆర్నాల్డ్ :- భారతదేశముయొక్క ఈ సర్వప్రియ

కావ్యమయ దార్శనిక గ్రంథములేనిచో, ఆంగ్లసాహిత్యము నిక్కముగ అపూర్ణముగనే యుండును.

10. వారన్ హేస్టింగ్స్ :- ఉన్నత శిఖరముల నధిరోహింప దలంచు మానవులకు గీతోపదేశ మద్వితీయమైనది.

11. బంకించంద్ :- భగవద్గీతలోవలె అపూర్వధర్మసమన్వయము, అద్భుత వ్యాఖ్య ఏ దేశమునను ఏ కాలమునను, ఎవడును కనియుండడు. వినియుండడు.

## గీతాజయంతి

వ్యక్తులవలె జయంతి జరుపుకొనగల్గు భాగ్యము గీతాగ్రంథమునకు కలిగినది. దాని వైశిష్ట్యమువలననే దానికట్టి అపూర్వగౌరవము సిద్ధించినది. శ్రీకృష్ణభగవానుడు రణరంగమున అర్జునునకు గీతోపదేశము చేసిన సుదినము మార్గశిర శుద్ధ ఏకాదశి. కాబట్టి ఆ దినము మహాపర్వదివసముగ భావింపబడుచున్నది. శ్రీరామజయంతి, శ్రీకృష్ణజయంతి, శ్రీ బుద్ధజయంతి, శ్రీ దత్తాత్రేయజయంతి, శ్రీ శంకరజయంతి, మున్నగు ఉత్సవములు జరుగు పవిత్రదినములందు ఆ యా అవతారపురుషులను జనులెట్లు అర్చించుచుందురో, శ్రీ గీతాజయంతి సందర్భమునగూడ గీతాదేవిని అర్చించు ఆచారము కలదు. ఆ సుదినమున గీతా గ్రంథముయొక్కయు, శ్రీకృష్ణ, శ్రీవ్యాస, శ్రీఅర్జునులయొక్కయు అర్చనలతోబాటు ఈ క్రింది కార్యక్రమములను గూడ అమలుజరుపుట చాలమంచిది.

(1) భగవద్గీత మొత్తము 18 అధ్యాయముల పారాయణము వ్యక్తిగతముగ గాని, సామూహికముగగాని జరుపవలెను. భక్తులు కొందఱు చేరినచో సమష్టి పారాయణము జరుపుటయే శ్రేష్ఠ

తరము. ఏలననగా సమష్టి పారాయణమువలన జనించు గీతా ఘోష జనుల ఉత్సాహమును రేకెత్తించుటయేకాక దూరముననున్న వారి శ్రుతిపుటములను గూడ పునీత మొనర్పగలదు. గీత పూర్తి అయిన పిదప మాహాత్మ్యమును గూడ పూర్తిగా చదువవలెను.

(2) గీతాతత్త్వము నెఱింగిన మహనీయులచే ఆనాడు గీతను గూర్చి ఉపన్యాసముల నేర్పాటు చేయించవలెను. గీతోపన్యాస ముల మూలకముగ జనులలో గీతయందలి మహోన్నత భావములు వ్యాప్తినొందుటయే కాక గీతపై వారికి మిక్కుటమగు అధికము కాజా చ్చును. తత్ఫలితముగ వారికి సంసారదుఃఖములు అంతమై పరమానందప్రాప్తి చేకూరగలదు. ఇంతకుమించిన పరోపకార్యము వేఱొకటి యేది కలదు? కాబట్టి ఇట్టి బ్రహ్మవిద్యాదానము నకు, గీతాజ్ఞానవితరణమునకు జనులు దోహదమును కల్పించి తద్ద్వారా జనసామాన్యముయొక్క నైతిక, ఆధ్యాత్మిక విలువలను అభివృద్ధి పఱచవలెను. అట్లు కావించువారు జ్ఞానయజ్ఞము నాచరిం చిన మహాపుణ్యమును బడయుటయేకాక శ్రీకృష్ణపరమాత్మయొక్క అనుగ్రహమునకు పాత్రులున్ను కాగలరు.

(3) పిన్నలలోను, పెద్దలలోను గీతాపోటీపరీక్షలు ఏర్పాటుచేసి గెలుపొందిన వారికి ఆనాటి సాయంత్రము బహిరంగసభలో బహుమతులు పంచిపెట్టవలెను. ఆ బహుమతులుకూడా గీతాసంబం ధమైన పుస్తకములే యుండుట మంచిది. ఈ పరీక్షల మూలకముగ ఏదియోవిధముగ తీవ్రమైన అధ్యయనము సంభవించగలదు. ఉత్సా హమున్ను జనులలో పెంపొందగలదు.

(4) సామాన్యజనులకు గీతయందాసక్తి కలుగుటకుగాను గీతా బుఱ్ఱకథలు, గీతాహరికథలు ఇతర విధములైన గీతాకాలక్షేపములు జరిపించుట శ్రేయస్కరము. గీతకు సంగీతము తోడైనప్పుడు అట్టి

విద్యావినోదముల కలయికచే జనసామాన్యము గీతవైపునకు మిక్కుటముగ ఆకర్షింపబడగలదు. జనులకు గీతాపరిచయము గావించుటకిది యొక చక్కని మార్గము.

(5) గీతాసారమును, గీతావిశేషములను సంక్షేపముగ వచ్చొత్తించి కరపత్రములద్వారా జనులకు తెలియబఱచుటయు గావింపవచ్చును. గీతాసాహిత్యమును విరివిగ వ్యాపింపజేయుట ఇకా్కలమున అత్యవసరము. శక్తికలవారు ఆ పవిత్ర దినమున గీతాగ్రంథములను ముముక్షువులకు, సాధుపుంగవులకు, భక్తులకు ఉచితముగ పంచిపెట్ట వచ్చును.

(6) అనేకులు ఒకచోట చేరుటకు అవకాశమున్నచో అచ్చోట గీతాసంబంధమైన వివిధవ్యాఖ్యలతో గూడిన గ్రంథరాజములను, పద్య, గద్యములను సంపుటములను, గీతోపన్యాస రూపములైన పుస్తకములను, గీతాసంబంధ చిత్రములను, ఇంకను ఇతరమగు గీతాసాహిత్యమును జనుల సౌకర్యార్థము ప్రదర్శింపవచ్చును. (Gita - Exhibition).

(7) గీతాజయంతి మహాపుణ్యదివసమగుటవలన, ఆనాడు గీతాగ్రంథమును శ్రీకృష్ణపరమాత్మ, శ్రీవేదవ్యాసమహర్షి, అర్జునుడు-వీరియొక్క పటములను చిత్రవిచిత్రముగ పుష్పాదులతో నలంకరించి రథముపైగాని, చిన్ని శకటముపైగాని ఉంచి మేళతాళములతో, భజనలతో పురముయొక్క ప్రధానవీధులగుండా ఊరేగింపు జరుపవలెను.

(8) ముఖ్యముగ గీతాజయంతి సందర్భమున జనులు కొన్ని పారమార్థిక ప్రతిజ్ఞలను గావించవలెను. ప్రతిదినము ఒక అధ్యాయమునుగాని, లేక కొన్ని శ్లోకములనుగాని తప్పక పారాయణము చేయుదునని ఆనాడు ప్రతినగైకొనవలెను. తదనుసారము ప్రతినిత్యము గీతాసంబంధ అనుష్ఠానమును తప్పక పరిశీలించుచు, మరల ఒక సంవత్సరమునకు అనగా తిరిగి గీతాజయంతి

నాడు అధ్యాత్మపథమున తానెంతవఱకు ముందుకేగినది, గీత ఎంతవఱకు కంఠస్థముగ వచ్చినది, శీలమెంతవఱకు శుద్ధపడినది పరీక్షించుకొనవలెను. ఈ ప్రకారముగ నిర్మాణకార్యక్రమము అమలు జరుపులాగున చూడవలెను.

గీతాసంబంధమైన ఒకింత సేవయైనను సాక్షాద్భగవత్సేవయే యనియు, ఒకింత ప్రచారమైనను భగవత్కైంకర్యమేయనియు తలంచి ముముక్షువులు గీతాజ్ఞాన వ్యాప్తికి, గీతాప్రచారమునకు చేయూతనిచ్చుచు, తాము తరించి యితరులను గూడ తరింపజేయుటకై యత్నించుచు శ్రీకృష్ణపరమాత్మయొక్క అపారకృపకు పాత్రులగుదురుగాక !!

## గీతోద్యానవిహారము

శ్రీరాగము - ఆదితాళము

1) భగవద్గీతో। ద్యానవిహారము। భక్తి నౌసర్పగ। పరుగున రండీ।
సొగసున దానిని। జూడగనయ్యెడు। సులువగుత్రోవను। జూపెద నండీ
2) భారతయుద్ధపు। పరిసరభూముల। బయులుదేరిన। భాగ్యంబండీ।
ధీరుడు వ్యాసులు। స్థిరముగనాటిన। దివ్యోద్యాన। క్షేత్రము సుండీ।
3) రహినిల కృష్ణుడు। రక్తితో పార్థుని। రథమును నడిపిన। రంగం బండీ।
ఇహపరసుఖకర। హేతుభూతముల। నెన్నియు యాతడు। పన్నినదండీ।
4) ఇలపయినద్ది పది। యెన్మిదియౌయక। రంబుల పరిమితి। రాజి లునండీ।

సలలితముగనటు। సప్తశతంబుల। సద్వృక్షంబులు। వెలగును సుండీ।

5) ఎప్పుడు వాడని। పూవులుసుండీ। ఎప్పుడు కుళ్లని। ఫలములు సుండీ।
తప్పక మనమా। ధన్యవనికి జని। తలకొక కొన్నిటి। దెత్తమురండీ।

## గీతా మంగళహారతి

1) పావన గీతా మాతా
జయ మంగళహారతి గైకొనుమా ॥

2) భక్తజనావని బంధవిమోచని
భవభయహారిణీ భవ్యదాయినీ ॥ ॥ పావన ॥

3) సర్వలోక సంరక్షణీ గీతా
సర్వదేవ సంసేవిత జననీ
శాంతివిధాయిని సత్యప్రదాయిని
సత్వగుణాలయ సచ్చరిత. ॥ పావన ॥

1) మంగళంబిదే చేకొనుమమ్మా ఓ భగవద్గీతా
మాతా, శ్రీభగవద్గీతా మాతా, ॥ మం ॥

2) సంగదూరులగు జ్ఞానుల హృదిలో వెలిగెడి జ్యోతివి నీవెకదా
పరమపావనువి ధ్యానముచేత విక్షేపము తొలగింపగదే ॥మం॥

3) పార్థుని నెపమున మురళీకృష్ణుడు కలిమానవులను పాలింప
ఆర్తినాశకర మగునీజ్ఞాన జ్యోతిని జూపెను జగములకు ॥మం॥

4) మూడవస్థలకు సాక్షివి నీవు మూడు గుణంబులు లేకుండు
వాడవు నీవను అనుభవమొసగి పరమానందము నీయగదే ॥మం॥

సంస్కృతములో :-

(1) జయతు జయతు గీతా కృష్ణవక్త్రప్రభూతా
జయతు జయతు గీతా సర్వలోకైకమాతా
జయతు జయతు గీతా దైవసంపత్ప్రపూతా.
జయతు జయతు గీతా విశ్వశాంతిప్రసూతా.

తా ॥ శ్రీకృష్ణుని ముఖారవిందమునుండి ఆవిర్భవించినదియు, సర్వజగజ్జననియు, భక్తిని, ముక్తినిగూడ నొసంగునదియు, ప్రపంచమున శాంతిని నెలకొల్పునదియు నగు గీతకు జయమగుగాక!

(2) మంగళం శ్రీ కురుక్షేత్రరణక్షోణి విహారిణే
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్

తా ॥ కురుక్షేత్ర రణరంగమున విహరించువాడును, అర్జునుని రథసారథియు, గీతాచార్యుడు నగు శ్రీకృష్ణమూర్తికి మంగళమగుగాక !

హిందీలో :-

(1) జయ భగవద్గీతే జయ భగవద్గీతే
హరి హియ కమల విహారిణీ సున్దర సుపునీతే. ॥ జయ ॥

(2) కర్మ సుమర్మ ప్రకాశిని కామాసక్తిహరా
తత్త్వజ్ఞాన వికాశిని విద్యా బ్రహ్మపరా ॥ జయ ॥

(3) నిశ్చల భక్తివిధాయిని నిర్మల మలహారీ
శరణరహస్యప్రదాయిని సబవిధి సుఖకారీ ॥ జయ ॥

(4) రాగద్వేషవిదారిణి కారిణి మోదసదా
భవ భయహారిణి తారిణి పరమానన్దప్రదా. ॥ జయ ॥

(5) అసుర భావ వినాశిని నాశిని తమరజనీ
దైవీ సద్గుణదాయిని హరిరసికాసజనీ. ॥ జయ ॥

(6) సమతా త్యాగ సిఖావని హరి ముఖకీ వాణీ
సకల శాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రాణీ. ॥ జయ ॥

(7) దయాసుధా బరసావని మాతు ! కృపాకీ జై
హరిపదప్రేమ దానకర అపనోకరలీ జై. ॥ జయ ॥

తాత్పర్యము :— విష్ణుభగవానుని హృదయకమలమునందు విహరించునదియు, సుందరమై, పరమ పవిత్రమై యొప్పునదియు, కర్మరహస్యమును బోధించునదియు, కామాసక్తిని రూపుమాపునదియు, తత్త్వజ్ఞానమును ప్రకాశింపజేయునదియు, ఉత్కృష్టబ్రహ్మవిద్యాస్వరూపిణియు, నిశ్చల భక్తిని గలుగజేయునదియు, సంసారమాలిన్యమును తొలగించునదియు, 'శరణాగతి' రహస్యమును బోధించునదియు, సర్వవిధముల సుఖమును గలుగజేయునదియు, రాగద్వేషములను ఛేదించివైచునదియు, నిరంతరము పరమానందమును ప్రసాదించునదియు, సంసారభయమును పారద్రోలునదియు, జీవులను తరింపజేయునదియు, అసురస్వభావమును నశింపజేయునదియు, రజస్తమస్సులను చీల్చి చెండాడునదియు, దైవీసంపదను గలుగజేయునదియు, భగవద్భక్తులకు అలంకరణభూతమైనదియు, సమత్వమును, త్యాగమును నేర్పునదియు, విష్ణుభగవానుని ముఖమునుండి ఉద్భవించినదియు, సమస్త శాస్త్రములకు మిన్నయు, శ్రుతులకు రాణివంటిదై యలరుచుండునదియు, దయారసామృతమును వర్షించునదియు నగు భగవద్గీతకు జయమగుగాక ! ఓ గీతాదేవీ ! మాపై కృపకల్గియుండుము. హరిపాదపద్మయుగళమందు మాకు ప్రీతిని జనింపజేయు తల్లీ ! మమ్ములను మీ దరిజేర్చుకొనుడు !!

# గీతా ముచ్చట్లు

## భగవద్గీత

## 1వ అధ్యాయము

## అర్జున విషాదయోగము

సుబ్బన్న :- ఏమి మామయ్యా ! ఈ రోజు ఇంట్లో అంతా హడావుడిగా వుందేమిటి ?

గురవయ్య :- ఏం లేదు సుబ్బన్నా ! రేపు గీతా జయంతి పండుగ కాబట్టి ఇల్లంతా శుభ్రంగా కడుగుతున్నారు అంతే.

సుబ్బన్న :- ఇదేమిటి మామయ్యా! కొత్త పండుగ పట్టుకొచ్చావు? ఇంతవరకు ఆ పేరు నేనెప్పుడు వినలేదే! సంక్రాంతి, శివరాత్రి, దీపావళి ఇలాంటి పండుగలను గూర్చి నాకు తెలుసేగాని గీతాజయంతిని గూర్చి నాకేమీ తెలీదు. అదేమిటో కొంచెం వివరించి చెప్తావా?

గురవయ్య :- చెప్తాను విను రేపు మార్గశిర శుద్ధ ఏకాదశి. పరిగ్గా అదేరోజున శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్ర యుద్ధరంగములో అర్జునునకు భగవద్గీతా బోధగావించాడు. అది మహాపవిత్ర దినం. కాబట్టి ఆ రోజున పండుగ జరుపుకొంటున్నాము. రేపు గీతామతల్లి పుట్టినరోజు.

సుబ్బన్న :- గురవయ్య మామయ్యా ! ఆ పండుగ ఎట్లా జరపాలో కొంచెం చెప్తావా !

గురవయ్య :- ఆ పండుగనాడు గీతాచార్యులగు శ్రీ కృష్ణ

నకు గీతా గ్రంథమునకు భక్తితో పూజ చేయాలి. ఆ రోజు శ్రీకృష్ణుని విగ్రహమును గాని పటమునుగాని ఓ చిన్నమంటపముపై పెట్టి నలువీధులా ఊరేగింపు జరుపవచ్చును. పేదలకు అన్నదానం చేయవచ్చును. సాయంత్రం బహిరంగ సభ జరిపి గీతాబోధను ప్రజలకు అందజేయవచ్చును. ఈ విధంగా గీతా ప్రచారం చేస్తే భగవంతునికి ప్రీతిపాత్రమైన కార్యము చేసినట్లు అవుతుంది. భగవదనుగ్రహమునకు అతడు పాత్రుడవుతాడు.

సుబ్బన్న :- అయితే మామయ్యా! భగవద్గీత పుట్టుపూర్వోత్తరాలు గూర్చియు, అందులో చెప్పబడిన నిగూఢరహస్యములను గూర్చియు కొంచెం తెలియజేస్తావా!

గురవయ్య :- చెప్తాను, విను. దుర్యోధనుడు అహంకరించి పాండవులకు రాజ్యంలో కొద్ది భాగమైనను ఇవ్వటానికి ఇష్టపడ లేదు. ఎందరో పెద్దలు దుర్యోధనునకు నచ్చచెప్పటానికి ప్రయత్నం చేశారు. కాని ప్రయత్నాలు ఫలించలేదు యుద్ధం అనివార్యమయింది. పాండవ కౌరవ పక్ష సైనికులు ఇరువురు కురుక్షేత్ర రణరంగములో ప్రవేశించారు.

సుబ్బన్న :- మామయ్యా! ఎవరెవరికి ఎంతెంత సైన్యం ఉందో తెలుపుతావా ?

గురవయ్య :- విను. కౌరవులకు 11 అక్షౌహిణీల సైన్యం ఉన్నది పాండవులకు 7 అక్షౌహిణీల సైన్యం ఉంది.

సుబ్బన్న :- అక్షౌహిణీ అంటే ఏమిటో చెప్తావా, మామయ్యా!

గురవయ్య :- విను 21,870 ఏనుగులు, 21,870 రథములు, 65,610 గుఱ్ఱములు, 1,09,350 మంది సైనికులు గల సైన్యమును అక్షౌహిణీ అంటారు.

సుబ్బన్న :- తరువాత యుద్ధక్షేత్రములో ఏం జరిగిందో

కొంచెం చెప్పు మామయ్యా ?

గురవయ్య :- యుద్ధం ప్రారంభంకానున్న సమయంలో ధృతరాష్ట్రునకు రణరంగములో ఏమి జరిగిందో తెలిసికోవాలని కుతూహలం కలిగి సంజయుని ఆ యుద్ధ వార్తలను గూర్చి చెప్పమని అడిగాడు. అప్పుడు సంజయుడు ఈ ప్రకారంగా చెప్పసాగాడు.

సంజయుడు :- ధృతరాష్ట్ర మహారాజా! ఇరువైపుల సైనికులు బారులు తీర్చి యుండగా పాండవుల శక్తివంతమైన సైన్యాన్ని చూచి భీతిల్లి దుర్యోధనుడు ఆచార్యుడగు ద్రోణుని వద్దకు వెళ్ళి ఇట్లా చెప్పటం మొదలుపెట్టాడు. గురుదేవా! ఈ పాండవుల సైన్యం చూడండి. మీ శిష్యుడగు ధృష్టద్యుమ్నుని నాయకత్వంలో ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, యుయుధానుడు, విరాటుడు, ద్రుపదుడు, దుష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైభ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు మొదలైన హేమాహేమీలు ఉన్నారు. ఇక మనసైన్యంలోనో మీరు భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తి, మొదలయిన వీరులున్నారు. ఇంకా ఎందరో విజయం కొరకు తమ ప్రాణాలను అర్పించటానికి సిద్ధంగా ఉన్నారు. గురువుగారూ! మీరూ తక్కినవారు అందరూ కలిసి భీష్ముని రక్షించటానికి సిద్ధంగా ఉండండి.

సరిగా అదే సమయాన కురువృద్ధులైన భీష్మాచార్యులు దుర్యోధనునకు సంతోషము కొల్పుటకై పెద్దగా శంఖాన్ని వూదారు. తర్వాత తక్కిన వారందరూ కూడ తమతమ శంఖాలను, భేరీలను తప్పెటలను మ్రోగించారు. తదుపరి అర్జున రథసారథియయిన శ్రీకృష్ణుడు తన శంఖమగు పాంచజన్యాన్ని వూదారు. అర్జునుడు దేవదత్తమను శంఖాన్ని, భీముడు పౌండ్రం అను శంఖాన్ని,

ధర్మరాజు అనంత విజయం అను శంఖాన్ని నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములను శంఖములను; కాశీరాజు, శిఖండి, దృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ఉపపాండవులు, అభిమన్యుడు తమతమ శంఖాలను బిగ్గరగా ఊదారు. పాండవుల ఆ శంఖానినాదములను విని దుర్యోధనాదులు హడలిపోయారు.

సుబ్బన్న :— మామయ్యా! ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పు?

గురవయ్య :— తర్వాత అర్జునుడు శ్రీకృష్ణునితో తన రథాన్ని రెండు సేనలమధ్య నిలుపమని చెప్పాడు. పార్థసారథి అట్లేచేశారు. అపుడు అర్జునుడు ఎదురుగా బారులు తీర్చి యున్న కౌరవ సైన్యాన్నంతా ఒకసారి తేరిపారచూచాడు. అచ్చట కొత్తవారెవ్వరూ లేరు. గురువులు, మామలు, బావలు, బావ మరుదులు, బంధువులు, మిత్రులు - వీరు మాత్రమే వున్నారు. వాళ్లను చూడగానే అర్జునుని హృదయంలో విషాదం పుట్టు కొచ్చింది. అపుడు తన సారథియగు శ్రీకృష్ణునితో ఇట్లా పలికాడు - మహాత్మా మా వాళ్ళను నేనెట్లా చంపేది. స్వజనులతో నేను యుద్ధం ఎట్లా సాగించేది. వాళ్ళను చంపి నేనేమి మూట కట్టుకునేది. నాకు విజయం వద్దు, రాజ్యం వద్దు, ప్రాపంచిక సుఖాలు వద్దు, వీళ్ళను వధించి నేనెట్లా పాపాన్ని అనుభవించేది. పాపంచేత నరకప్రాప్తి కలుగుతుంది. నాకు యుద్ధం చేయుబుద్ధి కావటం లేదు. నా ఒడలు కంపిస్తున్నది. తలగ్రుమని తిరుగు చున్నది. గాండీవము చేతిలో నుంచి జారిపోతున్నది. దీనికి తోడు ఇప్పుడు దుశ్శకునాలే కానవస్తున్నవి. కావున శ్రీకృష్ణా! ఇక నేను యుద్ధం చేయనని భీష్మించి శోకసంవిగ్నమానసుడై రథంలో చతికిలపడ్డాడు అర్జునుడు.

# భగవద్గీత

# 2వ అధ్యాయము

# సాంఖ్యయోగము

సుబ్బన్న :- యుద్ధానికి స్వస్తిచెప్పి అర్జునుడు రథంలో కూలబడిన తర్వాత ఏం జరిగిందో చెప్పు మామయ్యా ?

గురవయ్య :- అర్జునుని యొక్క వింతవైఖరిని చూచి అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ పకపకనవ్వి ఈ ప్రకారంగా హితబోధ చేశారు. ఏమిటి అర్జునా ! కీలక సమయంలో నిన్ను దుర్బలత్వం పట్టుకుంది ! ఇట్లా చేయుటం నీకు తగదు. క్షుద్రమగు దౌర్బల్యాన్ని తుడిచివేసి ధైర్యోపేతుడవై యుద్ధం చేయి, లే! కర్తవ్యానికి గడంగు. ఆ మాటలు వినగానే అర్జునుడు కృష్ణా! పరమపూజ్యాలగు గురువులను వధించి బంధువులను హతమార్చి ఆ రక్తపు కూడు నేనెట్లా తినేది. దేవా! నాకేమీ తోచడం లేదు. ఇప్పుడు నా కర్తవ్యమేమిటో సెలవివ్వండి మీరు గురువులు నేను శిష్యుడ్ని నన్నాజ్ఞాపించండి. అని వచించి గురుదేవునకు ప్రణమిల్లాడు. అప్పుడు గీతాచార్యులగు శ్రీకృష్ణుడు ధైర్యపూర్వకమగు ఈ వాక్యములును పలికారు.

అర్జునా! 'బంధువులు చనిపోతారు' అని వాపోవుచున్నావే ఆ బంధువులు ఎవరు? వారు జడమైన దేహములనుకున్నావా?! కాదు. ప్రతివ్యక్తి పాంచభౌతికమైన దేహము కాదు శాశ్వతమైన ఆత్మ. అదియే మానవుని యొక్క నిజస్వరూపము. దానినే 'దేహి' అంటారు. దేహము కాలగర్భంలో విలీనమైపోతుంది. కాని 'దేహి' శాశ్వతము. అది పుట్టదు, చావదు. అగ్నిచే కాల్చబడదు, నీటిచే తడపబడదు. ఆయుధములచే ఛేదింపబడదు. అది నిత్యమై

నది, సత్యమైనది, శాశ్వతమైనది, అదియే జీవుని యొక్క యథార్థ స్వరూపము. దేహమునకు జన్మజరాది వికారములు కలుగుతవేగాని సచ్చిదానందమగు ఆత్మకు కాదు.

అర్జునా! మనుజుడు తాను వధించు వస్త్రములు చినిగిపోయినచో వాటిని వదలివేసి నూతనవస్త్రాలను ఎట్లా ధరిస్తాడో అట్లే జీవుడు శిథిలమైన దేహమును వదలివేసి కర్మవశాత్తు లభించు నూతనదేహాన్ని పరిగ్రహిస్తాడు. ఆత్మజ్ఞానమును సంపాదిస్తే అసలిక దేహమును పరిగ్రహింపక జన్మరాహిత్య స్థితిని పొందుతాడు. కావున దిగులు పడవలసిన పనిలేదు, లెమ్ము! కర్తవ్యనిష్ఠుడవు కమ్ము!



యోధాగ్రేసరుడవగు నీవు యుద్ధము చేయనిచో శత్రుపక్షము వారు నిన్ను పిరికిపంద అని తలంతురు. గౌరవంగా బ్రతికేవారికి అపకీర్తి చావుకంటే హీనమైనది. ఇది ధర్మయుద్ధము గెలిస్తే రాజ్యం వస్తుంది, వనిపోతే స్వర్గం చేకూరుతుంది. కాబట్టి ఇక విషాదములకు తావీయక నీ క్షత్రియ ధర్మమును పాలించు. ఆత్మయందు స్థితి కలిగి కర్తృత్వరహితుడవై యుద్ధం చేయి. సంగమును వదలి కర్మలను చేస్తే అవి నిన్ను అంటనేరవు.



అజ్ఞాని ఆత్మస్వరూపాన్ని తెలియక ఈ సంసార కూపంలోపడి కామక్రోధాదులకు వశుడై నానాబాధలను పొందుచున్నాడు. ఏ విధంగా వాడు పతనమై పోతున్నాడో చెప్తాను విను. మొట్టమొదట తనకిష్టమైన వస్తువును గూర్చి ఆలోచన మొదలు పెడతాడు. వెంటనే ఆ వస్తువుతో సంగమము ఏర్పడుతుంది సంగమముచే కామము వుద్భవిస్తుంది. కామముచే క్రోధము జనిస్తుంది. క్రోధముచే మోహము వుద్భవిస్తుంది. మోహముచే స్మృతి కోల్పోతాడు స్మృతి భ్రంశముచే బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశిస్తే గోతిలో పడతాడు. దుఃఖాలను అనుభవిస్తాడు. కాబట్టి అర్జునా అజ్ఞానమును

పార్థ(ద్రో)! ఆత్మయందు స్థితికలిగి స్థితప్రజ్ఞుడవై నిస్సంగముగా లోకములో వ్యవహారం చేయి. కర్తవ్య కార్యములను నిర్వహించు.

గురవయ్య :- సుబ్బన్నా! శ్రీకృష్ణుడు అర్జునునితో ఈ విధంగా పలుకగా అప్పుడు అర్జునుడు వెంటనే గురుదేవులను ఇలా ప్రశ్నించాడు - అర్జునుడు - కృష్ణా! స్థితప్రజ్ఞుడంటే ఎవరో, అతని నడవడిక ఎట్లా ఉంటుందో కొంచెం విశదీకరించి చెప్పు మహాత్మా!

గురవయ్య :- అర్జునుని ఆ ప్రశ్నను పురస్కరించుకొని అప్పుడు గీతాచార్యులగు శ్రీకృష్ణుడు ఇలా సెలవిచ్చారు. శ్రీకృష్ణుడు - అర్జునా! మంచి ప్రశ్నవేశావు. స్థితప్రజ్ఞుడంటే ఎవరో చెప్తాను, సావధానంగా విను - జ్ఞానం స్థిరంగా కలవానిని స్థితప్రజ్ఞుడంటారు. స్థితప్రజ్ఞుడు మనసులోని కోరికలన్నిటిని వదలివేస్తాడు. ఆత్మయందే స్థితి కలిగి ఆత్మయందే సంతుష్టుడై వుంటాడు. దుఃఖములు తటస్థిస్తే కృంగిపోడు. సుఖాలు సంభవిస్తే పొంగిపోడు. రాగము, ద్వేషము, కోపము, మొదలగు దుర్గుణాలకు చోటీయడు. (తిలోదకాలిస్తాడు.)

చెరువులో తాబేలు పరిసరములు నిశ్శబ్దంగా వున్నప్పుడు తన ఇంద్రియాలను చాచుకొని నీటిలో తిరుగుతూ ఏదైనా శబ్దం కలిగితే వాటిని ముడుచుకొనునట్లు - స్థిత ప్రజ్ఞుడు వ్యవహార కాలమున ఇంద్రియములతో అయా కార్యములను చేసినను సమాధి నిష్ఠయందు వాటిని అంతర్ముఖ మొనర్చి నిశ్చలుడై వుంటాడు. స్థితప్రజ్ఞుడు ఇంద్రియాలకు లోబడడు. మనస్సుకు లోబడడు వాటిని తన అదుపాజ్ఞలలో వుంచుకుంటాడు. ఈ ప్రకారంగా మనోవిజయ మును సంపాదించి, ఇంద్రియములపై ఆధిపత్యము కలిగి విషయాశ ఏమాత్రము లేనివాడై ఆత్మయందు నిలకడ కలిగి యావజ్జీవితము పరమశాంతిని అనుభవిస్తాడు.

# భగవద్గీత
# 3వ అధ్యాయము
# కర్మయోగము

సుబ్బన్న :- మామయ్యా! గీతాచార్యులు ఎంత చక్కటి జ్ఞానబోధ చేశారు! వినుటకు ఇంపుగా వుంది! జీవితానికి సొంపుగా వుంది. ఆత్మజ్ఞానశ్రవణ రూపముగు ఈ మహదావకాశము నాకు కలిగినందులకు నేనెంతో సంతోషిస్తున్నాను. ఇట్టి మహోన్నత సత్యములను వినుట వలన నా జన్మ ధన్యమైంది. ఇక తరువాత ఏం జరిగిందో చెప్పు మామయ్యా!

గురవయ్య :- శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు మొట్ట మొదట ఆత్మస్వరూపమును గూర్చి వర్ణించి ఆ పిదప స్థితప్రజ్ఞుని లక్షణములను విశదీకరించగా అది విని అర్జునుడు భగవానుని ఇట్లా ప్రశ్నించాడు - స్వామీ! జ్ఞానం గొప్పదైనచో మరి కర్మరంగములోనికి నన్నెందులకు ప్రేరేపించుచున్నారు? అప్పుడు శ్రీకృష్ణుడు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చారు. నాయనా! అర్జునా! లోకములో జ్ఞానయోగము, కర్మయోగము అను రెండు పథములను నేను ఇదివరకు ఏర్పాటు చేసి యుంటిని. ఎవరి సంస్కారము ఎట్లా వుంటుందో వారు దానిని ఆచరించి లక్ష్యాన్ని పొందుతారు. కర్మ ఏమీ తక్కువైనది కాదు నిష్కామంగా దాన్ని ఆచరిస్తే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధిచే జ్ఞానం ఉదయిస్తుంది. జ్ఞానంచే మోక్షం లభిస్తుంది.

ఈ సందర్భాన ఇంకొక విషయం జ్ఞాపకం వుంచుకో. కర్మ చేయకుండా ఎవడును కూడ ఒక్క క్షణం ఉండలేడు. శరీరయాత్ర కొరకై కర్మ చేసియే తీరాలి. కర్మ చేయకుండా నైష్కర్మ్య

సిద్ధిని ఎవడును పొందలేదు. పెద్దలు ఎట్లా ఆచరిస్తారో తక్కిన వారు అద్దానినే అనుసరిస్తుంటారు. కాబట్టి కర్మను ఆసక్తి రహితంగా చేస్తూ, కర్తృత్వ రహితంగా ఆచరిస్తూ మానవుడు క్రమంగా జ్ఞానసిద్ధిని పొందాలి. ఫలములను ఈశ్వరార్పణ గావించుచూ అహంభావమును వదలి కర్మలను చేస్తే అవి ఎంతయో శ్రేయమును మానవునకు కలుగజేస్తవి.

చేతులు కాళ్ళు కదలించకుండా ఒకచోట కూర్చుని జ్ఞానేంద్రియములతోను, మనస్సుతోను ప్రాపంచిక విషయములను గూర్చి ఆలోచించటం మంచిదికాదు. అది మిథ్యాచారమని చెప్పబడుతుంది. కాబట్టి జ్ఞానేంద్రియములను మనస్సును నిగ్రహించి కర్మేంద్రియములతో చక్కగా లోకంలో వ్యవహరించటం మంచిది. ముల్లోకములలో నాకు చేయవలసిన పని ఏమియు లేకున్నను లోకసంగ్రహార్థమై నేను కర్మలను చేస్తూనే వున్నాను. నేను కర్మలను చేయనిచో జనులు కూడ ఏ కర్మను చేయక సోమరులై పోతారు. నిష్కామంగా కర్మలను చేస్తే ఆసక్తి రహితంగా కర్మలను ఆచరిస్తే అది ఒక మహాయజ్ఞంగా రూపొందుతుంది.

జనకుడు మొదలైన మహారాజులు నిష్కామకర్మయోగమును ఆచరించి అసక్తముగా కర్మలనొనర్చి సిద్ధిని బడయ గలిగారు కాబట్టి అర్జునా అహంకారమును వదలి కర్తృత్వమును విడనాడి ఈశ్వరార్పణ బుద్ధితో నీ విధ్యుక్త ధర్మమును నెరవేర్చుము.

సుబ్బన్నా! ఈ ప్రకారంగా కర్మయోగాన్ని గూర్చి గీతాచార్యులు అనర్గళంగా బోధిస్తుండగా మధ్యలో అర్జునునకు ఒక సందేహం పుట్టుకొచ్చింది. ఆ సందేహ నివారణ చేసుకోటానికై కృష్ణుడ్ని ఈ ప్రకారంగా అడిగాడు

కృష్ణా! అధర్మం చేయడం తప్పని అందరికి తెలుసుకదా! పాపం

చేయడం పొరపాటని అందరికీ తెలుసుకదా! మరి తెలిసి కూడా పాపకార్యాన్ని జనులు ఎందుకు చేస్తున్నారు ? బలాత్కారంగా అధర్మాన్ని ఎందుకు ఆచరిస్తున్నారు?

ఆ మాటలు విని గీతాచార్యులు ఇలా సెలవిచ్చారు - అర్జునా! అనేక జన్మలనుండి కామక్రోధాది వాసనలు జీవునిలో ప్రబలంగా వుంటున్నాయి. ఆ రెండు గుణాలు రజోగుణం వల్ల ఏర్పడతాయి. వాటి ప్రేరణతో చేయకూడదనుకున్నను బలాత్కారంగా జీవుడు పాపం చేస్తాడు. నిప్పును పొగకప్పి వేసినట్లును, అద్దమును దుమ్ము కప్పివేసినట్లును, గర్భస్థ పిండమును మావికప్పివేసినట్లును. పవిత్రమైన ఆత్మను ఈ కామాది దుర్గుణములు కప్పివేస్తున్నాయి. కాబట్టి విజ్ఞుడగువాడు తన బుద్ధిని శుద్ధం చేసికొని దాని సహాయముచే మనస్సును, ఇంద్రియములను నిగ్రహించి ఆ అనేక జన్మార్జితములైన కామాది దుర్వాసనలను, దుర్గుణాలను హృదయ కుహరాన్నుండి పెకలించి పారవేయాలి. ఆ దుర్గుణాలు జీవునకు పరమ శత్రువులు. వివేకము ద్వారాను, దృఢమైన పురుష ప్రయత్నము చేతను ఆ దుస్సంస్కారములను పారద్రోలి బుద్ధికి సాక్షిగా యున్న ఆత్మయందు నింకడ కలిగి అదే తన నిజస్వరూపమని భావించి జీవుడు సంసార సముద్రం దాటివేయాలి.

# భగవద్గీత

## 4 వ అధ్యాయము

## జ్ఞానయోగము

సుబ్బన్న :— — గురవయ్య మామయ్యా! కర్మయోగాన్ని గూర్చి విపులంగా బోధించిన తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునకు ఏమి తెలిపారు?! ఈ గీతాబోధ వింటుంటే మామయ్యా! నాకెంతో ఆనందంగా ఉంది. ఇటువంటి మంచి విషయాలు వినే అదృష్టం నాకు కలిగినందుకు చాల సంతోషిస్తున్నాను.

గురవయ్య :— సుబ్బన్నా! కర్మయోగాన్ని గూర్చి చెప్పిన తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునితో ఇలా పలికారు.

అర్జునా! ఈ నిష్కామకర్మయోగాన్ని ఇప్పుడు నీకు చెప్పటమే కాదు. ఇదివరకే నేను దీనిని సూర్యునకు ఉపదేశించాను. సూర్యుడు మనువునకు చెప్పాడు. మనువు ఇక్ష్వాకునకు చెప్పాడు. తర్వాత రాజర్షులెందరో దానిని గురించి పరంపరగా తెలుసుకున్నారు. కాని కొంతకాలానికి ఆ బోధ కాలగర్భంలో విలీనమై పోయింది. దానినే తిరిగి ఇప్పుడు నీకు చెప్పాను.

సుబ్బన్నా! శ్రీకృష్ణుడు ఈ మాటలు చెప్పగానే అర్జునునకు ఒక సందేహం పుట్టుకొచ్చింది. దానిని గూర్చి వెంటనే ఇలా అడిగాడు

శ్రీకృష్ణా! మీరు ఇటీవల జన్మించినారు, కాని సూర్యుడు కోట్లకొలది సంవత్సరాల క్రిందటనే యున్నారు. అట్టి సూర్యునకు మీరెట్లు ఉపదేశించారో నాకు బోధపడటం లేదు. అది ఎలా సంభవమయ్యిందో దయచేసి చెప్పండి.

అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా పలికారు. - అర్జునా! నేను ఇప్పటి వాడనుకాను, నాకు ఇదివరకెన్నియో జన్మలు గడచినవి. నీకును గడచినవి. ఆ జన్మలను గూర్చి నాకు బాగా తెలుసు, నీకు తెలియదు.

ఎప్పుడెప్పుడు లోకంలో అధర్మం పెరిగిపోయి, ధర్మం క్షీణి స్తుందో అప్పుడప్పుడు నేనొక దేహం ధరించి ఈ ప్రపంచంలో అవతరిస్తుంటాను. సాధువులను, సత్పురుషులను రక్షించుటకును పాపులను, దుష్టులను, దుష్కర్మలనాచరించు వారిని నశింపజేయు టకును నేను దేహం ధరించి వస్తుంటాను.

అర్జునా! ఏది మోక్ష ప్రాప్తికి అతి ముఖ్యమైనదో, అన్ని సాధ నలు, అన్ని యోగములు దేనియందు పరిసమాప్తి చెందుతుంటాయో అట్టి జ్ఞానమును నీకు ఇపుడు తెలుపుతున్నాను, సావధానంగా విను. జ్ఞానతపస్సు, జ్ఞానయజ్ఞము, జ్ఞాననౌక, జ్ఞానాగ్ని, జ్ఞానఖడ్గము అనువాటిని గూర్చి తెలుసుకుంటే జ్ఞానమంటే ఏమిటో నీకు బాగా బోధపడుతుంది.

ముందుగా జ్ఞానతపస్సు అంటే ఏమిటో చెప్తాను విను. రాగము, కామము, క్రోదము అను దుర్గుణములను వదలివేసి ఆత్మ యందు చిత్తమును లగ్నము చేయుట జ్ఞానతపస్సు అందురు. జ్ఞానమనునది ఒకానొక మహాయజ్ఞము. నిష్కామ బుద్ధితో కర్మల నాచరించి చిత్తశుద్ధిని బడసి తదుపరి ఆత్మానాత్మ విచారణ సలిపి జ్ఞానం పొందాలి. ప్రపంచంలో ఎన్నో రకముల యజ్ఞములున్నప్ప టికిని వాటన్నిటిలోను జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనది అనుభవజ్ఞుడైన గురువు దగ్గరకెళ్ళి వారికి సాష్టాంగ ప్రణామములాచరించి వారికి సేవలను గావించి వినయవిధేయతలతో తనకున్న సందేహములను గూర్చి వారిని అడగాలి. అప్పుడు వారు చక్కని జ్ఞానోపదేశం

చేస్తారు. అట్టి జ్ఞానంతో అవిద్య పటాపంచలై పోతుంది. అప్పుడు తానాత్మస్వరూపుడననియు, సమస్త ప్రపంచము తనలో కల్పితమై యున్నదనియు తెలుసుకుంటాడు.

జ్ఞానము ఎంతటి ప్రభావము కలిగయున్నదంటే అట్టి జ్ఞానముచే మహాపాపియైనను పాపసముద్రాన్ని దాటివేయుగలుగుతాడు. మండుచున్న అగ్ని కట్టెలన్నిటిని దహనము చేసివేయునట్లు జ్ఞానమను అగ్ని కర్మలన్నిటిని భస్మము చేసివేస్తుంది. కర్మలు నశించి పోవుటవలన జీవునకు మోక్షము కరతలామలకమవుతుంది.

అసలు జ్ఞానమంటే ఏమిటో చెప్తాను విను. దానిని గూర్చి నీకిదివరకే తెలియజేశాను. జీవుని యొక్క యథార్థ స్వరూపము చైతన్యమగు ఆత్మయేకాని జడమగు శరీరము కాదు ఈ నామ రూపాత్మక ప్రపంచము సచ్చిదానంద ఆత్మయందు, బ్రహ్మ మందు కల్పింపబడినది. ఈ సత్యమును తెలిసికొని భోగాదులందు విరక్తి కలిగి మనస్సును అంతర్ముఖముగ త్రిప్పి చిత్తమును ఆత్మయందు స్థాపించాలి. ఇదియే జ్ఞానము.

ఈ ఆత్మజ్ఞానముతో సమానమైన వస్తువు ముల్లోకములందును లేదు. ఇట్టి పవిత్ర వస్తువు మరెచటనూ లేదు దానిని సాధన చేత జీవుడు స్వయముగానే పొందవలెను. కర్మయోగము ద్వారా చిత్తశుద్ధిని బడసి అట్టి నిర్మల చిత్తము ద్వారా ఆత్మజ్ఞానాన్ని సంపాదించవచ్చు. అది వెంటనే లభించకపోయినను కాలక్రమమున సాధనయొక్క తీవ్రతను బట్టి అనుభూతమౌతూంటుంది. దానిని పొందటానికి శ్రద్ధలు ఎంతయో అవసరము. శ్రద్ధలేనివారు, విశ్వాసములేనివారు జ్ఞానమును లక్ష్యమును ఎన్నటికిని పొందలేరు. శ్రద్ధా విశ్వాసముల చేతను, భక్తిచేతను, వైరాగ్యము చేతను ఆత్మ జ్ఞానాన్ని పొందగలిగితే ఇక అతనికి పరమశాంతి చేకూరుతుంది, జన్మధన్యమైపోతుంది.

కాబట్టి సాధకుడు జ్ఞానమను ఖడ్గము ద్వారా అవిద్యను సంశయమును ఛేదించివేసి ఈ జీవితమందే తన హృదయస్థమగు ఆత్మయందు నిలకడను పొందాలి. ఆత్మజ్ఞానముచే అపుడాతనికి కలిగే ఆనందము, సంతృప్తి, శాంతి వర్ణనాతీతము. కాబట్టి అర్జునా! లెమ్మా! సాధనలను తీవ్ర మొనర్చుము. ఆత్మయందు స్థితుడవై మానవజన్మను చరితార్థమొనర్చుకో.

# భగవద్గీత

## 5వ అధ్యాయము

## కర్మసన్న్యాస యోగము

సుబ్బన్న :- మామయ్యా! జ్ఞానయోగాన్ని గూర్చి చెప్పిన తర్వాత శ్రీకృష్ణుడు తిరిగి ఏం బోధించారు!

గురవయ్య :- సుబ్బన్నా! జ్ఞానయోగాన్ని గూర్చి విన్న తర్వాత అర్జునునకు ఒక సందేహం కలిగి కృష్ణుడ్ని ఇలా ప్రశ్నించాడు - కృష్ణా కర్మలను వదలటం మంచిదా, చేయటం మంచిదా? కర్మసన్న్యాసం మంచిదా, కర్మయోగం మంచిదా ? అర్జునుని ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణుడు ఇలా ఉపదేశించావిరి - కర్మలను త్యాగం చేయటంకంటే చేయటమే మేలు. నిష్కామ బుద్ధితో కర్మలనాచరించుట వలన మనుజునకు చిత్తశుద్ధి కలిగి తద్వారా జ్ఞానం అంకురిస్తుంది. జ్ఞానం చేత తానెవరో ఈ జగత్తు యొక్క స్వరూపమేమిటో తన నిజస్వరూపమేమిటో చక్కగా తెలుసుకుంటాడు. కాబట్టి సంగము లేకుండా తగులుకొనకుండ, నిష్కామ బుద్ధితో, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను చేయాలి.

ఆత్మనిర్లేపమైనది. ఇంద్రియములు చేసే కార్యాలను అది సాక్షిగా గమనిస్తుంటుంది. ఈ శరీరము 9 ద్వారములు గల పట్టణము. ఆ పట్టణములో ఆత్మ అనే రాజు తానేమియు చేయించకయు, చేయకయు తటస్థంగ యుండును. మరి జనులు ఏల దుఃఖం పొందుతున్నారంటే అజ్ఞానం చేత పవిత్రమైన వారి ఆత్మ కప్పబడివుంటుంది. జ్ఞానాన్ని సంపాదించి ఆ అజ్ఞానాన్ని పోగొట్టుకోవాలి సూర్యుడు మేఘంచేత తనలో కప్పబడి

నపుడు చీకటిగా వుంటుంది. ఆ చీకటికి కారణం మేఘమే కాని సూర్యుడు కాదు. గాలిచేత మేఘము తొలగిపోతే సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాశిస్తాడు. ఈ ఆత్మ విషయం కూడ అంతే. అయితే ఆ ఆత్మను పొందటానికి, ఆత్మానుభూతిని బడయటానికి నిరంతర సాధన అవసరం. ఆ ఆత్మను గూర్చియే నిరంతర చింతన చేస్తూ వుండాలి. దాని గూర్చియే మనన నిదిధ్యాసాలు గావిస్తూ ఉండాలి. అట్లా చేస్తూ వుంటే కొంతకాలానికి ఆత్మానుభూతి చక్కగా కలిగి అజ్ఞానం పటాపంచలైపోయి పునరావృత్తి రహిత శాశ్వత కైవల్యము జీవునికి సిద్ధిస్తుంది.

ఈ ప్రపంచంలో ప్రతి జీవియందు ఆత్మ వెలుగుతూనే వుంది. కాబట్టి సమస్త జీవరాశుల యెడల సమబుద్ధి కలిగి వుండాలి. విద్యా వినయ సంపన్నుడగు బ్రాహ్మణునియందు, ఆవుయందు, ఏనుగు యందు, కుక్కయందు, కుక్కమాంసం తినే చండాలునియందు సమదృష్టి కలిగి యుండాలి. ఉపాధులు వేరైనప్పటికి ఆత్మ ఒక్కటే కావున అందరి ఎడల దయాదాక్షిణ్యాలు కలిగి వుండాలి. తన సుఖాన్ని తానెట్లు కోరుతున్నాడో పరుల సుఖాన్ని కూడ అట్లాగే కాంక్షించాలి. మనుజుడు ప్రయత్న పూర్వకముగా ఆత్మయందు నిలకడను సంపాదించి ప్రియ, అప్రియములందు సమభావన కలిగి యుండాలి. ప్రియము కలిగినప్పుడు పొంగిపోరాదు. అప్రియము కలిగినప్పుడు క్రుంగిపోరాదు. ప్రపంచములో మానవుడు అనుభవించు అన్ని సుఖాలకంటె ఆత్మ సుఖం మిన్నయైనది. ప్రాపంచిక సుఖములన్నీ క్షయములు, ఆత్మసుఖము అక్షయమైనది. ఆ సుఖాన్ని అనుభవించాలంటే మనస్సు బాహ్యసుఖాలను ఉపేక్షించాలి. ప్రాపంచిక విషయాలకు, భోగాలకూ స్వస్తి చెప్పాలి మనస్సు అంతర్ముఖం కావాలి. దృశ్య వైభవములు, విషయ సుఖములు పైకి సుఖంగా కనిపించినా లోపల

దుఃఖము నిగూఢమై వుంటుంది. కాబట్టి ఆ తళుకు బెళుకులను చూచి ఎవరూ మోసపోరాదు. పైగా అవి క్షణికములు. కొద్ది సేపుంటే మళ్ళీ అంతరించి పోతాయి. కాబట్టి విజ్ఞులు వాటి వెంట పరుగెత్తరు. ఆత్మ సాక్షాత్కారము పొందదలచినవారు కామక్రోధాదులను జయించాలి. వాటి వేగాన్ని అరికట్టాలి. ఈ కార్యము ఎప్పుడు సాదించాలంటే శరీరం పతనంకాక పూర్వమే. శరీరం ఎప్పుడు పతనమై పోతుందో ఎవరికీ తెలియదు కాబట్టి ముముక్షువగువాడు వెంటనే సాధన కుపక్రమించి ఆ కామక్రోధాది అరిషడ్వర్గముపై విజయాన్ని సాధించాలి. అప్పుడే అతనికి పూర్ణ సుఖం లభిస్తుంది.

పూర్ణ సుఖములోపలే వుంది గాని బయటలేదు కాబట్టి మను జుడు వైరాగ్యోపేతుడై బాహ్యమునుండి మనస్సును మరల్చి అంతర్ముఖము చేసి మహోన్నతమగు ఆత్మసుఖాన్ని అనుభవించాలి. పాపమున్నవారికి ఆత్మానుభూతి కలుగదు. కావున పుణ్యాకర్మాచ రణే జ్ఞాన విచారణే పాపాన్ని పోగొట్టుకోవాలి. సమస్త ప్రాణికోట్ల యెడల ప్రేమ, దయ, కరుణ కలిగి ఉండాలి.

కామక్రోధాదులను జయించువానికి నిర్మల చిత్తము కలవానికి మోక్షము ఇక్కడనే లభిస్తుంది. ఇంకొక లోకానికి పోనక్కరలేదు. పరమశాంతి ఆతనికి ఇక్కడనే చేకూరుతుంది. ఆత్మయొక్క అను భూతి ఆతనికి కలుగుట వలన పరమ సుఖము, పరమశాంతి, పరమానందము యొక్క అనుభవము ఆతనికి కలుగుతాయి. జన్మ తరించిపోతుంది.

# భగవద్గీత

## 6వ అధ్యాయము

## ఆత్మ సంయమయోగము

సుబ్బన్న :- -- మామయ్యా! కర్మ సన్న్యాస యోగాన్ని గూర్చి చెప్పిన తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునకు ఏమి బోధించారో తెలియజేస్తావా?

గురవయ్య :- చెప్తాను విను ! ఏ యోగం కావలసి వున్నా అందులకు ఏకాగ్రత, ధ్యానం, ఇంద్రియనిగ్రహం అవసరం కాబట్టి శ్రీకృష్ణ పరమాత్మ తదుపరి ధ్యానయోగాన్ని గూర్చి ముచ్చటించారు. ఆత్మ సంయమయోగాన్ని వివరించారు.

ఆత్మ అనేపదాన్ని మూడర్థాలలో వాడుతూంటారు. ఆత్మ అంటే దేహమని, కొన్ని సందర్భాల్లో వాడుతుంటారు. 1) వాడు ఆత్మహత్య చేసుకున్నాడంటే దేహాన్ని చంపుకున్నాడని అర్థం వస్తుంది. 2) కొన్నిచోట్ల ఆత్మఅంటే మనస్సని అర్థం వస్తుంటుంది. ఇచ్చోట అదే అర్థంలో వాడబడింది ఆత్మ సంయమమనగా మనస్సంయమమని భావము. 3) మరి కొన్ని చోట్ల ఆత్మ అనే పదాన్ని పరమాత్మ అనే అర్థములో వాడుతుంటారు.

సుబ్బన్న :- అయితే మామయ్యా! ఈ అధ్యాయములో భగవానుడు ఏఏ విషయాలను గూర్చి ప్రస్తావించారో తెలియజేస్తావా?

గురవయ్య :- చెప్తాను, విను. ఈ ఆధ్యాత్మిక క్షేత్రములో ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి ఎవరి మోక్షం వారే సంపాదించుకోవాలి. మరియొకరెవరోగాని, గురువులు గాని శాస్త్రాలు గాని, మోక్షాన్ని ప్రసాదిస్తాయి - అనే మాట కల్ల. తనను తానే

ఉద్ధరించుకోవాలని గీతాచార్యులు ఈ అధ్యాయ ప్రారంభములోనే తెలియజేశారు. అమూల్యమైన ఈ మానవజన్మను పొంది ఎవరూ జీవితాన్ని వృథా చేసుకోరాదని, చేయరాని పనిచేసి దుర్గతిని పొందరాదని, పవిత్ర కార్యమొనర్చుకొని ఇంద్రియాల్ని అదుపు లోకి తెచ్చుకొని మానవుని మాధవునిగా చేసికొనవలెనని భగవానుడు సెలవిచ్చారు. తన ఇంద్రియాల్ని తాను లోబరుచుకుంటే అవి బంధువులుగా ప్రవర్తిస్తాయని, వాటిపై అదుపులేకపోతే శత్రువులుగా వర్తిస్తాయని గీతాచార్యులు తెలియజేశారు.

సాధకుడైనవాడు జ్ఞానవిజ్ఞానముం రెండింటిని సంపాదించాలి. మట్టిగడ్డ, బంగారము - రెండింటిని సమభావముతో చూడాలి. ఆత్మయందు మనస్సును నెలకొల్పటానికి అనవరతము ప్రయత్నించాలి. మిత్రుల యెడల, శత్రువుల యెడల, ఉదాసీనుల యెడల, మధ్యస్థుల యెడల, ద్వేషుల యెడల, బంధువుల యెడల సమభావము కలిగి వర్తించాలి.

అర్జునా! ఇక ధ్యానం ఎట్లా చేయాలో చెప్తాను విను-

ధ్యానశీలుడు ఇంటిలోగాని, బయటగాని ఏకాంతముగా ఒక్కడే కూర్చుని ధ్యానము చేయాలి. ఇద్దరుముగ్గురు ఒకేచోట కూర్చొని ధ్యానం చేస్తే వాడేమిచేస్తున్నాడు? వీడేమి చేస్తున్నాడు! అనే సంకల్పం కలిగి విక్షేపం ఉదయిస్తుంది. ధ్యానయోగి ఇతర కోరికలెవ్వియు లేనివాడై ఆత్మయందే మనస్సును సంలగ్నపరచుటకై ప్రయత్నించాలి. తాను కూర్చుని ధ్యానం చేసేచోటును పరిశుభ్రంగా వుంచుకోవాలి. ఆసనంపై స్థిరంగా కూర్చోవాలి. ఎత్తయిన చోటగాని, పల్లంగా వున్నచోటగాని, కూర్చొనరాదు. దర్భాసనము వేసికొని దానిపై ఏదైనా చర్మము పరచుకొని దానిపై వస్త్రమును వేసికొని ధ్యానానికి ఉపక్రమించాలి. మనస్సును ఇంద్రియ విషయములపై పోనీయక అంతర్ముఖ మొనర్చాలి. దృష్టి

వ్యామోహాన్ని వదలివేసి ఆత్మయందు అనురాగాన్ని పెంచుకోవాలి. ఇంద్రియాలను వాటివాటి విషయములపైకి పోనీయక అరికట్టాలి. వైరాగ్యాన్ని బోధించి వాటిని తన అదుపాజ్ఞలలో వుంచుకోవాలి. ధ్యానానికి కూర్చున్నప్పుడు శిరస్సు, కంఠము, మొండెము నిటారుగా ఉండవలెను. ముక్కు చివర దృష్టి నుంచి దిక్కులను చూడక నిమీలిత నేత్రుడై గాని, లేక కళ్ళు మూసికొని గాని ధ్యానం చేయవచ్చును. అయితే నిద్రరాకుండా జాగ్రత్త పడాలి. ప్రశాంత హృదయుడై, నిర్భయుడై, బ్రహ్మచర్యమును శీలించుచు ధ్యానయోగాన్ని బాగా అభ్యసించాలి. ఇతర చింతన లెవ్వియు లేక మనస్సును ఆత్మయందు కేంద్రీకరించాలి.

అర్జునా ! ధ్యానాభ్యాసి మరికొన్ని జాగ్రత్తలను అవలంభించాలి. ఎక్కువగా తినకూడదు. అసలేమియు తినక వుండరాదు. ఆహార నియమము కలిగి మధ్యేమార్గాన్ని అవలంభించాలి. యుక్తాహార విహారియై ప్రవర్తించాలి. ఎక్కువసేపు నిద్రించకూడదు. అసలు నిద్ర లేకనూ వుండరాదు. ఇట్టి మధ్యమ మార్గము నవలంబించుట వలననే యోగికి ధ్యానము చక్కగా కుదిరి సుఖాన్ని పొందుతాడు. ఎప్పుడాతనికి ఆత్మయందు స్థిరత్వము కలుగుతుందో అప్పుడతడు పరమశాంతిని అనుభవిస్తాడు. ధ్యానము చేసేటప్పుడు మనస్సును ఏకాగ్రంగా వుంచుకోవాలి. ఇటునటు కదలనివ్వకూడదు. గాలివీచని చోట దీపమువలె నిశ్చలముగ, నిర్మలముగా వుండాలి. ధ్యానకాలములో ఆత్మస్థితి యందు మనుజుడు అనుభవించే సుఖము విషయసుఖమువంటిది కాదు. అది ఆత్యంతిక సుఖము, ఇంద్రియాతీతమైన సుఖము దానిని పొందటం ప్రపంచంలోని అన్ని లాభాల కంటే గొప్ప లాభం. అచ్చోట నిలకడను పొందినవాడు భయంకరమయిన దుఃఖము వచ్చి మీదపడ్డాకూడ ఏ మాత్రము చలింపడు. ధ్యానాన్ని అభ్యసించేటప్పుడు హడావుడి పనికిరాదు మెల్లమెల్లగా సాధన చేసుకుంటూ పోవాలి.

మనస్సును ఇతర విషయముల నుండి మరల్చి, ఆత్మయందు స్థాపించి, మరల దేనిని చింతన చేయక వుండాలి. ఒకవేళ మనస్సు బహిర్ముఖముగా పోతూవుంటే చంచలముగా వుంటే బుద్ధిచే దానిని చక్కగా నిగ్రహించి వైరాగ్యమును బోధించి బయటికి పోయేదాన్ని లోపలికి తీసికొనివచ్చి ఆత్మయందు కేంద్రీకరించాలి. ఎప్పుడు మనసు ఉపశమనము పొందుతుందో అప్పుడు వానికి మహోన్నతమైన ఆత్మసుఖము కలుగుతుంది. అది అన్ని సుఖాలకంటే అతీతమైనది. అట్టి ధ్యానశీలుడు సమస్త ప్రాణికోట్లయందు తన ఆత్మను దర్శించుచూ సమస్త ప్రపంచమును తనయందే వీక్షించుచూ అందరి యెడల సమభావము కలవాడై ప్రేమ, దయ, కరుణ కలిగి వర్తిస్తాడు. తానెట్లు సుఖాన్ని వాంఛిస్తాడో ఇతరులకు కూడ అట్టి సుఖము కలుగుతే బాగుండునని భావిస్తాడు తనకెట్లు దుఃఖము కలుగకూడదని తలంచుతాడో అట్లే ఇతరులకు కూడా దుఃఖాన్ని కలుగకుండా చూస్తాడు. ఈ ప్రకారంగా ఆత్మోపమ్య స్థితిని అవలంభిస్తాడు.

సుబ్బన్న :- మామయ్యా! శ్రీకృష్ణమూర్తి ధ్యానయోగాన్ని గూర్చి ఎంతో చక్కగా వర్ణించి చెప్పారు. వింటూ వుంటే ఎంతో ఆనందంగా వుంది. ఈ సంసారకూపంలోనుంచి బయటకు వచ్చి పరమశాంతిని ఎప్పుడు అనుభవిస్తామా అని మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. తరువాత భగవానుడు ఏం చెప్పారో కొంచెం విశదీకరించి చెప్పు మామయ్యా.

గురవయ్య :- శ్రీకృష్ణపరమాత్మ ధ్యానయోగాన్ని గూర్చి మనోనిగ్రహాన్ని గూర్చి అనర్గళంగా చెప్పుకుపోతుంటే అర్జునునకు ఒక సందేహం కలిగి భగవానుని ఈ ప్రకారంగా ప్రశ్నించాడు.

స్వామీ! మహాత్మా! మనోనిగ్రహాన్ని గూర్చి తామెంతో చక్కగా ప్రబోధిస్తున్నారు కాని ధ్యానములో నా మనస్సు నిల

వటం లేదు. అది మహా చంచలముగా వుంటున్నది. గాలినైనా అరికట్టి వచ్చునేమో కాని మనస్సును అరికట్టటం మహాకష్టసాధ్యంగా వుంది. దీనిని నిగ్రహించటానికి ఏదైనా వుపాయం సెలవివ్వండి. అర్జునుని ఆ ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణమూర్తి ఇలా ప్రత్యుత్తరమిచ్చారు. అర్జునా! నీవు చెప్పినట్లు మనస్సు మహా చంచలమైనదే నిగ్రహించుటకు కష్టసాధ్యమైనదే కాని అభ్యాసం చేతను, వైరాగ్యం చేతను దానిని అరికట్టవచ్చును. దానిని నిగ్రహించటం దుస్సాధ్యమేకాని అసాధ్యమెన్నటికిని కాదు. అనవరత సాధనల చేతను ఉపాయముల చేతను దాన్ని వశము చేసుకొనవచ్చును. కాబట్టి ఈ విషయమై ఏమీ కంగారు పడవలసిన పని లేదు. ప్రయత్నాతిశయముచేత, వైరాగ్యముచేత లక్ష్యము చక్కగా నెరవేరుతుంది.

ఆ మాటలు విన్న తరువాత అర్జునుడు మరల శ్రీకృష్ణమూర్తిని ఇలా ప్రశ్నించాడు - కృష్ణా! శ్రద్ధతో సాధనలను చేయుచున్నను ఈ జన్మలో మనోనిగ్రహము సిద్ధించనివానికి అనగా యోగ సిద్ధిని బడయనివానికి భవిష్యత్తులో ఎట్టి జన్మ సంభవిస్తుంది?

ఆ ప్రశ్నకు శ్రీకృష్ణుడు ఇలా జవాబిచ్చారు - అర్జునా! అట్టివాడు చనిపోయిన తరువాత పుణ్యవంతుల లోకమునకు పోయి అచట బహుకాలము నివసించి తరువాత శుచి, ఆచారము కలవారును, శ్రీమంతులును అగు వారి ఇండ్లయందు జన్మిస్తాడు. లేక, సాధనలు ఎక్కువగా చేసిన ఉత్తమ తరగతి యోగియైనచో యోగుల యొక్క వంశములో జన్మిస్తాడు. ఇట్టి మహోన్నతమగు జన్మ చాల దుర్లభమైనది. అచట జన్మించిన తరువాత పూర్వజన్మ యొక్క శుద్ధ సంస్కారము ననుసరించి యోగసాధనలను ఇంకను చక్కగా ఆచరించుచూ సిద్ధిని పొందుతాడు. కాబట్టి అర్జునా! చేసుకున్నవాడికి చేసు

కున్నంత మహాదేవా! అనునట్లు వారి వారి ప్రయత్నాతిశయములను బట్టి ఉత్తమ జన్మమిచ్చుచుండును. అప్పుడు శ్రద్ధా విశ్వాసములతో పూర్వజన్మ సంస్కారము ననుసరించి తీవ్ర సాధనలను గావించి సాధకుడు లక్ష్యసిద్ధిని పొంది తరిస్తాడు.

# భగవద్గీత
## 7వ అధ్యాయము
## విజ్ఞానయోగము

సుబ్బన్న :— మామయ్యా! ఆత్మ సంయమ యోగాన్ని గూర్చి విపులంగా చెప్పిన తర్వాత శ్రీకృష్ణుడు ఏమి బోధించారో చెబుతావా?

గురవయ్య :— — చెప్తాను విను, సుబ్బన్నా! భగవద్గీత మొత్తం 18 అధ్యాయములు కలిగి వుంది. దాన్ని మూడుగా విభజించారు పెద్దలు. మొదటి 6 అధ్యాయములు కర్మషట్కానము అని రెండవ 6 అధ్యాయములు భక్తి షట్కమని, చివరి 6 అధ్యాయములు జ్ఞానషట్కమని పేర్కొన్నారు. సుబ్బన్నా ఇప్పుడు కర్మషట్కము పూర్తయింది. నిష్కామ కర్మచేత భక్తి అభివృద్ధి పొందుతుందని భక్తి ద్వారా జ్ఞానం వుదయిస్తుందని జ్ఞానం ద్వారా మోక్షం లభిస్తుందని శాస్త్రాలు తెలుపుతున్నాయి. ఇప్పుడు భక్తిషట్కం ప్రారంభమవుతూంది. మొట్టమొదట శ్రీకృష్ణపరమాత్మ విజ్ఞానయోగాన్ని గూర్చి అర్జునునకు తెలుపుతున్నారు.

జ్ఞానమని, విజ్ఞానమని రెండు వున్నవి. జ్ఞానమనగా వాచాజ్ఞాన మనియు, శాస్త్రజ్ఞానమనియు, విజ్ఞానమనగా అనుభవజ్ఞానమనియు అంటారు. జ్ఞానవిజ్ఞానములు రెండును సాధకునకు వుండాలి. దీపం దీపం అని ఉచ్చరించిన మాత్రముచే చీకటి తొలగిపోదు. ప్రమిద, తైలం, వత్తి, అగ్గిపెట్టె తెచ్చుకొని వెలిగించినపుడు మాత్రమే చీకటి పటాపంచలైపోతుంది. విజ్ఞానయోగాన్ని ప్రారం భిస్తూ శ్రీకృష్ణుడు ఇలా తెలిపారు. అర్జునా! జ్ఞానవిజ్ఞానములు

రెండిటిని గూర్చి నీకిప్పుడు పరిచయం చేస్తున్నాను. వాటిని గూర్చి తెలుసుకుంటే అన్నిటిని తెలిసికొనినవాడవవుతావు. అప్పుడు అజ్ఞానం పటాపంచలైపోతుంది.

ప్రపంచంలో అనేకమంది మనుషులున్నా అందరూ మోక్షసిద్ధికై ప్రయత్నించటం లేదు. ఎవరో కొందరు మాత్రమే ప్రయత్నిస్తున్నారు. ఆ కొందరిలో ఒకానొకరు మాత్రమే మోక్షమును బడయుచున్నాడు.

ప్రకృతి పురుషుడు అని ఈ ప్రపంచమందు రెండు వున్నవి పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము ఇవన్నీ చేరి ప్రకృతి అనబడుతవి. పురుషుడనగా వీటన్నిటికి సాక్షి అయినటువంటి నిర్వికారమైన పరమాత్మ. భగవంతుడనగా అతడే. ప్రకృతి జడమైనది, పరమాత్మ చైతన్యమైనది. ఆ పరమాత్మ వలననే ఈ నామ రూపాత్మక ప్రపంచమంతయు ధరింపబడుతోంది. ఆ పరమాత్మ మినహా ఈ ప్రపంచంలో మరేమియు లేదు చైతన్యమగు ఆత్మ ఈ విశ్వమందు అణువణువునా ఓతప్రోతమైయున్నది. మణులందు దారము వలె ఈ ప్రపంచమున ఆత్మ వ్యాపించి యున్నది.

నీటియందు రసము, సూర్యచంద్రాదులందు కాంతి సమస్త వేదములందు ప్రణవము (ఓంకారము), ఆకాశమందు శబ్దము, మనుష్యులందు పౌరుషము, భూమియందు సుగంధము, అగ్ని యందు ప్రకాశము, సమస్త ప్రాణికోట్లయందు ప్రాణము, తాపసులందు తపస్సు ఆ భగవంతుడే అయి యున్నారు. వెయ్యేల, సమస్త ప్రాణులయొక్క బీజము ఆ భగవంతుడే. జనులు 3 గుణములకు లోబడినవారై ఆ 3 గుణములకు అతీతుడుగా వున్న భగవంతుని గూర్చి తెలిసికొనజాలకున్నారు. త్రిగుణాత్మకమైన మాయ దాటుటకు కష్టసాధ్యమైనది. కాని నన్ను (భగవంతుని) ఆశ్రయించినవారు ఈ మాయను అవలీలగా దాటివేయగలరు.

మాయకు లోబడి అసుర గుణములు కలిగి వున్నవారు దుష్కార్య మును చేయువారు సనాతనుడు అగు భగవంతుని ఆశ్రయింపక వారు దుష్కర్మముల వలన అధోగతిని పొందుచున్నారు.

సత్కర్మలను చేయువారు పుణ్యాత్ములు శాశ్వతుడగు భగ వంతుని సేవించి ధ్యానించి సద్గతిని పొందుతున్నారు. అట్టి పుణ్యాత్ములు 4 తరగతులుగా నున్నారు. మొదటివారు ఆర్తులు, అనగా ఏదైనా కష్టం కలిగినప్పుడు గాని దుఃఖము సంభవించినపుడు గాని భగవంతుని సేవిస్తారు. దేవుడా! నా దుఃఖం పోగొట్టుండని ప్రార్థిస్తారు. ఇక రెండవ తరగతివారు జిజ్ఞాసువులు. దేవుడెట్టి వాడో తెలుసుకోవాలనే కుతూహలం కలిగివున్నవారు. 3వవారు అర్థార్తులు. ధనమును గాని సంపదలను గాని కోరి వాటిని పొందుట కొరకై దేవుని అర్చించువారు. ఇక 4వ తరగతి వారు జ్ఞానులు. వారు భగవంతుని తప్ప మరిదేనిని కోరరు. అన్యమును వాంఛింపరు అనన్య భక్తితో దేవుని గూర్చి చింతన చేస్తుంటారు. ఆత్మానాత్మ విచారణ సలుపుతుంటారు. ఈ 4 విధములైన భక్తులు మంచివారేకాని జ్ఞాని అందరికంటే శ్రేష్ఠుడు. జ్ఞానికినాకు భేదం లేదు నేనే జ్ఞాని, జ్ఞానియే నేను. ఎన్ని జన్మలందో చేసిన పుణ్య పరిపాకముచే ఒకానొకడు జ్ఞానియై అట్టి జ్ఞానముచే నన్నాశ్రయించి మోక్షం పొందుతాడు. అట్టి జ్ఞాని సమస్తము వాసుదేవుడేనని భావించి ఆత్మయందే స్థితి కలిగివుంటాడు. అట్టి మహాత్ములు లోకంలో చాలా అరుదు.

మాయచే ఆవరింపబడినవారై జనులు భగవంతుని తెలిసికొ నజాలకున్నారు. మాయకు లోబడిన వారు మాయాతీతుడైన భగవంతుని ఎట్లు తెలిసికొనగలరు. అర్జునా! భూత భవిష్యతు వర్తమానములన్నిటిని నేను తెలిసికొన గలుగుచున్నాను కాని జనులు అజ్ఞానవశమున నన్ను తెలిసికొనుట లేదు.

ఎవరు పుణ్యకార్యాచరణ ద్వారా తమ పాపములను ప్రక్షాళనము చేసికొనుచున్నారో అట్టివారు దృఢవ్రతులై భగవంతుని అనన్యభక్తితో సేవించి తరిస్తున్నారు. ఈ ప్రపంచమున దేహధారులగు జీవులు వార్ధక్యము, మరణము మున్నగు దుఃఖములను అనుభవిస్తున్నారు. వాటినుండి విముక్తిని పొందుట కొరకై జన్మరాహిత్యమునకై కొందరు భగవంతుని ఆశ్రయించి ఆధ్యాత్మిక సాధనలొనర్చి తరిస్తున్నారు. అట్టివారు దుఃఖమునుండి విముక్తులగుచున్నారు.

# భగవద్గీత
## 8వ అధ్యాయము
## అక్షరపరబ్రహ్మయోగము

సుబ్బన్న :- మామయ్యా! విజ్ఞానయోగాన్ని గూర్చి చెప్పిన తరువాత శ్రీకృష్ణమూర్తి ఏమి బోధించారు?

గురవయ్య :- అక్షరపరబ్రహ్మయోగాన్నిగూర్చి తెలిపారు.

సుబ్బన్న :- అక్షర పరబ్రహ్మ అంటే ఏమిటో కొంచెం తెలియజేస్తావా?

గురవయ్య :- చెప్తాను విను 'క్షరమంటే నశించేది', 'అక్షర' మంటే శాశ్వతమైనది ఈ ప్రపంచములో పరబ్రహ్మము ఒకటి తప్ప తక్కిన పదార్థములన్నియు కాలగర్భంలో నశించిపోయేవే. శాశ్వతమై, సత్యమై, నిత్యమైనట్టి పరబ్రహ్మ మొకటియే అక్షర మైనది. అట్టి అక్షర పరబ్రహ్మమును గూర్చి శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు ఈ అధ్యాయమున బోధించారు.

ముందుగా అర్జునుడు శ్రీకృష్ణుని 7 ప్రశ్నలను అడిగాడు. సుబ్బన్నా! అర్జునుని పరమార్థ జిజ్ఞాస ఎంత తీవ్రమైనదో చూడు! ఎవరైనా శిష్యుడు సామాన్యంగా తన గురువును ఒక ప్రశ్న అడుగు తాడు, లేక జిజ్ఞాస ఎక్కువగా యుంటే రెండు ప్రశ్నలడుగుతాడు. కాని అర్జునుని యొక్క పారమార్థిక జిజ్ఞాస ఎంత ప్రబలమైనదంటే గురుదేవుని ఒక్కసారి 7 ప్రశ్నలడిగేశాడు. ఆ ప్రశ్నలేవనగా 1) బ్రహ్మమనగానేమి? 2) అధ్యాత్మమనగానేమి ? 3) కర్మమనగానె ట్టిది ? 4) అధిభూతమనగా నేమి? 5) అధి దైవమనగానేమి? 6) అధియజ్ఞమనగానేమి ? 7) అంత్యకాలమున భగవంతుని చింతన చేయుటెట్లు ఈ ప్రశ్నలన్నిటికిని శ్రీకృష్ణపరమాత్మ చక్కగా

సమాధానమిచ్చారు.

వినాశరహితమైనదే బ్రహ్మమనబడును. అధ్యాత్మమనగా ప్రత్యగాత్మ భావము. యజ్ఞాది రూపమైన త్యాగపూర్వకమైన క్రియకర్మంబనబడును. నశించు పదార్థము అధిభూతము. విరాట్పురుషుడు అధిదైవమనబడును. ఈ దేహమందు పరమాత్మయే అధి యజ్ఞమనబడును. ఎవడు అంత్యకాలమున కూడ భగవంతుని గూర్చి స్మరించుచు శరీరమును విడుచునో అతడు భగవంతునే పొందుచున్నాడు.

అర్జునా! ఎవడు మరణ కాలమున ఏయే భావమును కలిగి శరీరమును త్యజించునో అతడు ఆయా రూపములనే పొందుచున్నాడు. అంత్యకాలంలో దైవస్మరణ కలగాలంటే జీవితమంతా ఆ దైవాన్ని గూర్చే స్మరిస్తుండాలి. వారి వారి విధ్యుక్త ధర్మములను నెరవేరుస్తూ భగవత్ చింతన భగవద్విచారణ చేస్తూ జీవితాన్ని గడిపే వారికి అంత్యకాలంలో దైవ స్మరణ కలుగుతుంది. దానివలన సద్గతి లభిస్తుంది. అభ్యాసం వల్ల దైవచింతన ధృడపడుతుంది. కాబట్టి ఆధ్యాత్మిక సాధనలను యావజ్జీవితం చక్కగా అభ్యసించాలి. మనస్సును విషయములపై ప్రసరించకుండా దైవ చింతనమందే, దైవధ్యానమందే కేంద్రీకరించాలి.

భగవంతుడు ఎట్టివాడో ముందుగా తెలుసుకోవాలి. అతడెట్టివాడనగా అతడు సర్వజ్ఞుడు, పురాణపురుషుడు, జగన్నియామకుడు, అణువుకంటే సూక్ష్మమైనవాడు, సమస్త ప్రపంచమునకు ఆధారభూతుడు, చింతింపనలవి కానివాడు, తేజోమయుడు, తమస్సునకు పరమైనవాడు. ముముక్షువు అంత్యకాలమున, లేక సర్వకాలమందు భక్తితో గూడుకొనినవాడై భ్రూమధ్యమున దృష్టిని నిలిపి ఆ భగవత్స్వరూపమును చింతన చేయవలయును. ఆ పరమాత్మను వేదవేత్తలు

నాశరహితమైనవానిగా చెప్పుదురు. జితేంద్రియులు ఆ పరమాత్మ పదమునే పొందుతున్నారు. అట్టి మహోన్నత పదమును పొందుటకై కొందరు బ్రహ్మచర్యాది వ్రతములు పాలించుచున్నారు. మనుజుడు ఇంద్రియములన్నిటిని గ్రహించి మనస్సును అంతర్ముఖ మొనర్చి ఓంకారమును ప్రణవమును ఉచ్చరించుచు అర్థాన్ని భావ మున మననము చేయుచు పరమాత్మను గూర్చి ధ్యానించవలెను. ఇట్లు ఆచరించుచు శరీరమును త్యాగము చేయువాడే ఆ పరమా త్మను పొందుతాడు. అనన్య చిత్తముతో నిరంతరము దైవచింతన చేయువాడే అభ్యాసము సల్పువాడు. ఆ దైవపదాన్ని సులభంగానే పొందుతాడు.

అర్జునా! ఈ ప్రపంచం అశాశ్వతమైనది, దుఃఖమునకు ఆటపట్టై నది. దైవపదమును పొందినవాడు తిరిగి జన్మింపనేరడు. అట్టివాడు ఇక దుఃఖము నెన్నటికిని పొందకనే యుండును. మనుజుడు ఏ లోకమును పొందినను తిరిగి జన్మను పొందుచునే యుండు నుగాని, భగవంతుని పొందినచో ఇక జన్మలకు స్వస్తి చెప్పును. అప్పుడతనికి పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మత్వము సిద్ధిస్తుంది. దృశ్యపదార్థములన్నియు నశించును. ఆ పరమాత్మకు నాశనము లేదు. ఎవరిచే ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో అట్టి పరమాత్మను మనుజుడు అనన్య భక్తిచే తప్పక పొందగలడు.

పుణ్యకార్య తత్పరులు ప్రకాశవంతమగు మార్గముగుండా పయ నించి ఆ పరబ్రహ్మమును చేరుతారు. సకామ కర్మయోగులు అంధకార మార్గమున పయనించి మరల జన్మిస్తున్నాడు. కాబట్టి ఓ అర్జునా! ఎల్లకాలములందును యోగయుక్తుడవై యుండుము. అధ్యాత్మిక సాధనలను చక్కగా చేస్తుంటే వేదములందు యజ్ఞ ములందు తపస్సులందు, ధ్యానములందు ఎట్టి పుణ్యము కలదో అద్దానిని మించిన పుణ్యమును భగవచ్చింతనాపరుడగు యోగి పొందుచున్నాడు.

# భగవద్గీత

## 9వ అధ్యాయము

## రాజవిద్యారాజగుహ్యా యోగము

సుబ్బన్న :- మామయ్యా ! అక్షరపరబ్రహ్మయోగాన్ని గూర్చి వివరించి చెప్పిన తరువాత శ్రీకృష్ణుడు అర్జునునకు ఏం చెప్పారు?

గురువయ్య :- సుబ్బన్నా! తదుపరి రాజవిద్యా రాజగుహ్యా యోగాన్ని గూర్చి భగవానుడు చక్కగా విశదీకరించి చెప్పినారు. రాజవిద్య అంటే విద్యలలో కెల్లా శ్రేష్ఠమైనది. రాజగుహ్యమంటే అతి రహస్యమైనది. సుబ్బన్నా! ప్రపంచంలో ఎన్నో విద్యలున్నాయి గాని అందులో ఏ ఒక్కటీ గూడా మానవుని మృత్యువు నుండి తప్పించలేదు. ఎన్ని విద్యలు నేర్చుకున్నా మళ్ళీ పుట్టాల్సిందే. పుట్టినవాడు చావాల్సిందే. జనన మరణములనుండి వాడు తప్పించుకోజాలడు. కాని అధ్యాత్మ విద్య అటువంటిది కాదు. దానిని నేర్చుకొని చక్కగా అనుష్ఠించేవాడు జనన మరణముం నుండి తప్పించుకుంటాడు. అతనికి జన్మ రాహిత్యం సిద్ధిస్తుంది. వేయించిన విత్తనము ఎట్లా మొలకెత్తదో అట్లే అతనికి పునర్జన్మ వుండదు. కనుకనే పెద్దలు "చదువులకెల్ల సారమైన చదువు" అని దాని మహిమను వర్ణిస్తుంటారు అట్టి మహోన్నతమగు రాజవిద్యను గూర్చి శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు తెలియజేయబోవుచున్నారు.

సుబ్బన్న :- ఆ విద్యను నేర్చుకోవాలని నాకు కూడ కుతూహలం కలుగుతుంది. భగవానుడు దానిని గూర్చి ఏమి సెలవిచ్చారో కొంచెం విశదంగా తెలుపు మామయ్యా!

గురవయ్య :- చెప్తాను విను శ్రీకృష్ణుడు ఇలా అన్నారు -

అర్జునా! నీకు అసూయ అనే దుర్గుణము లేదు. మీ చిత్తం నిర్మలముగా వుంది. విద్యలలో కెల్లా శ్రేష్ఠమైన అధ్యాత్మ విద్యను వినుటకు మీకు చక్కని అర్హత వున్నది. కాబట్టి జ్ఞానవిజ్ఞానముల రెండింటిని గూర్చి నీకు చెప్పుచున్నాను విను. వాటిని గూర్చి తెలుసుకుంటే అవిద్యా బంధమునుండి విడివడగలవు. అధ్యాత్మ విద్య మహా పవిత్రమైనది. ఉత్తమమైనది. ఇది పరోక్ష విద్యకాదు, అపరోక్షవిద్య. దీని ఫలితములగు పరమానందమును, పరమ శాంతిని ప్రత్యక్షంగా అనుభవించవచ్చు. దీనిని ఆచరించటం మహా సులభమైనది. అయితే శ్రద్ధ చాలా అవసరము. శ్రద్ధా విశ్వాసములు లేనివాడు భగవంతుని పొందజాలక మృత్యువుతో కూడిన సంసార కూపంలో పడిపోతాడు. అర్జునా! ఈ సమస్త ప్రపంచము భగవంతుని చేత వ్యాపింపబడి యున్నది. ఆకాశమందు వాయువు వున్నట్లు ఈ బ్రహ్మాండమంతయు భగవంతునియందు అంతర్భూతమై యున్నది. భగవంతుడు ఈ జగత్తంతటికి అధ్యక్షుడు వారి సన్నిధానం చేతనే ప్రకృతి చరాచరములను సృష్టిస్తూన్నది.

కాని అజ్ఞానులు ఆ భగవానుని తెలిసికొనజాలకున్నారు. వారు వ్యర్థములగు ఆశలు కలవారై వ్యర్థములగు కార్యములను చేయుచు అసురప్రవృత్తి కలిగి వుంటారు. కాని మహాత్ములు దైవీ స్వభావం కలవారై అనన్యచిత్తులై భగవంతుని భక్తిపూర్వకముగా ధ్యానిస్తూ వుంటారు. భజిస్తూ ఉంటారు. వారు ఎల్లప్పుడు భగవంతుని గూర్చియే కీర్తించుచూ తరించుటకై ప్రయత్నం చేయుచూ దృఢ వ్రతమును అవలంభిస్తూ భక్తితో దైవమును ఉపాసిస్తూంటారు. వెయ్యేల, అట్టివారు జ్ఞానయజ్ఞమునే ఆచరిస్తూ వుంటారు.

అర్జునా ! నేను ఈ జగత్తునంతటికిని తండ్రిని, తల్లిని, తాతను, సర్వులకు వేద్యుడను, ఓంకార స్వరూపుడను, సమస్త ప్రపంచమునకును ప్రభువును, సర్వసాక్షిని. కాని కొందరు

భగవత్స్వరూపమును తెలిసికొనక సకామకర్మల నాచరించి స్వర్గాది లోకములను పొంది అచటి ప్రాపంచిక భోగములను అనుభవించి పుణ్యము క్షీణించగానే మరల ఈ భూలోకమున జన్మిస్తూ ఒక లోకమునుండి ఇంకొక లోకమునకు పయనిస్తూ ఈ సంసారమందే తిరుగాడుతుంటారు.

కాని భగవంతుని యెడల అనన్యభక్తి కలిగి ఆ పరాత్పరునే భక్తితో సేవించువారు ఆ భగవంతునే పొంది జన్మరాహిత్య స్థితిని బడయగల్గుతారు. అట్టివారి యొక్క యోగక్షేమాలను నేను జాగ్రత్తగా గమనిస్తూ ఉంటాను.

అర్జునా ! దేవుని పూజించుటయందు ధ్యానించుట యందు భక్తి ప్రధానమైనది. భక్తుడు భగవంతునికి ఏమి సమర్పించాడు అన్నది ప్రశ్న కాదు ఏ విధంగా సమర్పించాడన్నదే ముఖ్యమైన విషయము కొండంత నైవేద్యాన్ని దేవునికి సమర్పింప పనిలేదు. ఏ ఒక్క ఆకును గాని పువ్వును గాని పండును గాని కొంచెం నీటినిగాని భక్తితో నొసంగినచో అదియే పదివేలు. అట్టివానికి సద్గతి చేకూరుతుంది.

అర్జునా! మనుజుడు ఏది చేసినను, ఏది తినినను, ఏది హోమము చేసినను, ఏది ఇచ్చినను, ఏ తపస్సు చేసినను అద్దానిని భగవదర్పణముగా చేసినచో నిష్కామ బుద్ధితో ఒనర్చినచో అతడు ఉత్తమగతిని పొందగలడు. కర్మబంధము నుండి విడివడగలడు. అర్జునా! భగవంతుడు అందరి యెడల సమభావము కలిగి వుంటారు. ఎవరు దేవుని భజిస్తుంటారో వారికి సద్గతి కలుగుతుంది. అర్జునా ! మహా దురాచారపరుడైనను భగ వంతుని అనన్య భక్తితో ఆశ్రయిస్తే అతనికి హృదయ పరివర్తన కలిగి ప్రవర్తించుటచే సాధువుగానే పరిగణింపబడ్తాడు. అతడు శీఘ్రముగా ధర్మాత్ముడై పరమశాంతిని అనుభవిస్తాడు. భగ

సద్భక్తుడు ఎన్నటికిని పతనమును గాని, దుర్గతినిగాని పొంద నేరడు. అతడు సద్గతినే పొందుతాడు. ఎట్టి పాపులైనను భగవంతుని ఆశ్రయించి సేవించినచో వారు పరమగతినే బడయుగల్గుతారు. ఇక పుణ్యాత్ముల విషయమై వేరే చెప్పవలెనా అర్జునా! ఈ ప్రపంచము అనిత్యమైనది, ఇచట సుఖములేదు. కాబట్టి శాశ్వతపదవి కొరకు పరమానంద స్థితికొరకు జనులు భగవంతుని తప్పక సేవించాలి.

దేవుని యందే మనస్సును నెలకొల్పాలి. దేవుని అర్చించాలి పూజించాలి, ధ్యానించాలి, దేవుని గూర్చియే చింతన చేస్తూ వుండాలి అప్పుడు వారు పరమశాంతి దాయకమగు దైవపదమును పొంది అవిచ్ఛిన్నమగు ఆనందాన్నే అనుభవిస్తారు.

# భగవద్గీత

# 10వ అధ్యాయము

# విభూతి యోగము

సుబ్బన్న :- మామయ్యా ! రాజవిద్యా రాజగుహ్య యోగాన్ని గూర్చి బోధించిన తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునకు ఏమి చెప్పారో తెలియ జేస్తావా!

గురవయ్య :- సుబ్బన్నా! ఇప్పటికి భగవద్గీత సగం పూర్తయింది. పూర్వార్ధము సమాప్తమైనది. ఉత్తరార్ధము ప్రారంభమవుతుంది. శ్రీకృష్ణ పరమాత్మ ఇపుడు తన విభూతులను గూర్చి వర్ణించి చెప్పారు. విభూతి అంటే ఐశ్వర్యము, మహిమాతిశయము. ఈ ప్రపంచము భగవంతుని వ్యక్తస్వరూపమే కాబట్టి ప్రపంచములోని అన్ని వస్తువులు భగవత్స్వరూపములే అయియున్నవి. అయినను ముఖ్యమైన కొన్నిటిని ఇచట తెలియజేశారు.

సుబ్బన్నా! మొట్టమొదట శ్రీకృష్ణుడు అర్జునునకు ఇలా చెప్పారు - "అర్జునా! నా యొక్క విభూతులను గూర్చి నీకిదివరలో కొన్నింటిని తెలియజేశాను ఇప్పుడు మరల చెప్పచున్నాను విను" సుబ్బన్నా! శిష్యునిపై ఎంతో వాత్సల్యమున్నప్పుడే అనుగ్రహం వున్నప్పుడే గురువు ఆనందంతో చెప్పిన విషయాలనే మరల మరల నూరిపోస్తాడు. అర్జునుడు సద్గుణశీలుడు, పాపరహితుడు, అసూయాది దుర్గుణ వర్జితుడు, నిర్మల హృదయుడు, ఆధ్యాత్మిక జిజ్ఞాస కలవాడు, బ్రహ్మజ్ఞానమునకు అర్హత బడసిన వాడు కనుకనే గురుదేవుడగు శ్రీకృష్ణుడు పరమాత్మ అతని యెడల సంతుష్టుడై చెప్పిన విషయములనే మరల చెప్పచు తమ బోధను

ఇలా కొనసాగించారు.

అర్జునా! ఈ బ్రహ్మాండమంతటికిని ఆధారభూతుడను నేనే నా నుండియే ఈ సమస్త జగత్తు ఆవిర్భవించుచున్నది. ఈ సత్యమును తెలిసికొని జిజ్ఞాసువులు ముముక్షువులు భక్తితో నన్ను ఆరాధిస్తున్నారు. వారు భగవంతుని యెడలనే చిత్తమును నెలకొల్పి భగవంతుని గూర్చియే పరస్పరము ముచ్చటించుకొంటు ఆనందిస్తున్నారు. భక్తిభావముతో తమతమ జీవితాలను గడుపుతున్నారు. ఈ ప్రకారంగా ప్రీతి పూర్వకముగా నిరంతరము దైవచింతన చేయువారికి భక్తితో ఆరాధించువారికి నేను జ్ఞానయోగమును అనుగ్రహిస్తాను. వారి హృదయంలో ఏద్దైనా అజ్ఞానం, తమస్సు వుంటే దానిని జ్ఞానదీపం చేత పరిహరిస్తాను, తొలగించివేస్తాను.

సుబ్బన్న :- మామయ్యా! దీనిని బట్టి భక్తివలన జ్ఞానం కలుగుతున్నదని తెలుస్తుంది, నిజమేనా ?

గురవయ్య :- చక్కగా గ్రహించావు. కర్మచే భక్తి, భక్తిచే జ్ఞానము, జ్ఞానంచే మోక్షం లభిస్తాయి. చిత్తశుద్ధి కలవారికి పుణ్యబలంచే పాపాన్ని పోగొట్టుకొన్నవారికి, నిర్మల హృదయులకు తరించటానికి కావలసిన ఆత్మజ్ఞానాన్ని భగవంతుడే అనుగ్రహిస్తారు.

సుబ్బన్న :- గీతాచార్యులు తరువాత ఏం చెప్పారో తెలుపుతావా!

గురవయ్య :- చెప్తాను విను తరువాత అర్జునుడు శ్రీకృష్ణమూర్తిని భక్తిభావంతో స్తుతించాడు. అనంతరము వారి విభూతులలో ముఖ్యమైన కొన్నిటిని తెలుపు లాగున అర్థించాడు. ఏయే పదార్థములందు మీరు చక్కగా అభివ్యక్తమయి వున్నారో తెలుపుడని వినయపూర్వకంగా అడిగాడు. అప్పుడు భగవానుడు

ఇలా సెలవిచ్చారు - అర్జునా! నేను సమస్త ప్రాణులందును వెలయుచున్నాను. సమస్త పదార్థములందును వ్యాపించియున్నాను. సమస్త ప్రాణుల యొక్క ఆది మధ్యాంతములు నేనే. నేను ఆదిత్యులలో విష్ణువనువాడను. ప్రకాశింపజేయువానిలో కిరణములు గల సూర్యుడను దేవతలలో మరీచి యనువాడను, నక్షత్రములలో చంద్రుడను, వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలో చైతన్యమును, రుద్రులలో శంకరుడను, యక్షులలో కుబేరుడను, వసువులలో అగ్నిని, పర్వతము లలో మేరువును, పురోహితులలో బృహస్పతిని, సేనానాయకులలో కుమారస్వామిని, సరస్సులలో సముద్రమును.

మహర్షులలో భృగుమహర్షిని, వాక్కులలో ప్రణవమును, యజ్ఞ ములలో జపయజ్ఞమును, స్థిరపదార్థములలో హిమాలయ పర్వత మును, చెట్లలో రావిచెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపుడను, గుఱ్ఱములలో ఉచ్చైశ్రవసమును, ఏనుగులలో ఐరావతమును, మనుష్యులలో రాజును, ఆయు ధములలో వజ్రాయుధమును, ఆవులలో కామధేనువును, ప్రజల యుత్పత్తికి కారణభూతులయిన వారిలో మన్మథుడను, సర్పములలో వాసుకిని, నాగులలో అనంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, నియమించువారిలో యముడను, దైత్యులలో ప్రహ్లాదుడను, లెక్కపెట్టువారిలో కాలమును, మృగము లలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను, పవిత్రమొనర్చు వారిలో వాయువును, ఆయుధధారులలో శ్రీరాముడను, చేపలలో మొసలిని, నదులలో గంగానదిని, సృష్టులలో ఆది మధ్యాంతము లను, విద్యలలో అధ్యాత్మవిద్యను, వాదించు వారిలో వాదమును, అక్షరములలో అకారమును, సమాసములలో ద్వంద్వసమాసమును

నేనే.

నాశములేని కాలమును నేనే, విరాట స్వరూపుడను నేనే, మృత్యువును నేనే, సమస్తము యొక్క పుట్టుకయు నేనే; స్త్రీలలో గల కీర్తి, సంపద, వాక్కు, స్మృతిజ్ఞానము, ధారణాశక్తిగల బుద్ధి, ధైర్యము, ఓర్పు.

నేనే సామవేదగానములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రిని, మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంతఋతువును, తేజోవంతుల యొక్క తేజస్సును; జయమును, ప్రయత్నమును, సత్త్వగుణమును, వృష్ణివంశీయులలో వాసుదేవుడును, పాండవులలో శుక్రాచార్యుదును, దండించువారియొక్క దండనమును, జయింప ఇచ్ఛగలవారి యొక్క నీతిని, రహస్యములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానమును, ప్రాణికోట్ల యొక్క మూలకారణము నేనే, అర్జునా! నా యొక్క విభూతులకు అంతులేదు. కొన్నిటిని మాత్రమే ఇపుడు తెలిపినాను. ఒక్క మాటలో చెప్పుతున్నాను విను. ఏది ఐశ్వర్య యుక్తమైనదో, ఏది కాంతి వంతమైనదో, ఏది ఉత్సాహముతో కూడి యున్నదో అది యంతయు నా తేజస్సు యొక్క అంశమనే గ్రహించు. అర్జునా! ఇక అధికముగా చెప్పవేల? నేనీ జగత్తునంతను ఒక్క అంశముచేతనే వ్యాపించియున్నాను.

# భగవద్గీత

## 11వ అధ్యాయము

## విశ్వరూప సందర్శనయోగము

సుబ్బన్న :- మామయ్యా ! విభూతి యోగాన్ని గూర్చి వర్ణించి చెప్పినతర్వాత భగవానుడు అర్జునునకు ఏమి బోధించారు?

గురవయ్య :- సుబ్బన్నా! విభూతియోగం చివర ఈ ప్రపంచమంతా నా స్వరూపంలో ఒక అంశమని భగవానుడు తెలుపగా అర్జునునకు ఆ పరాత్పరుని విశ్వరూపమును దర్శించాలని కుతూహలం కలిగి అద్దానిని చూపుడని ప్రార్థించారు. అయితే ఆ అడుగుటలో ఎంతో వినయాన్ని ప్రదర్శించాడు. కృష్ణా! మీ విశ్వరూపం చూడటానికి నాకు అర్హత, యోగ్యత వున్నదని తాము భావించే పక్షంలో అద్దానిని చూపండి - అని ప్రార్థించాడు.

ఇంతవరకు చెప్పిన బోధవలన తన అజ్ఞానం, మోహం అంత రించి పోయిందని చెప్పాడు. సుబ్బన్నా ! భగవద్గీత యొక్క గొప్పదనము, అద్దాని మహిమ అర్జునుని వాక్యముల ద్వారా స్పష్టముగా వెల్లడగుచున్నవి. గీతా ప్రవచనము ఇప్పటికింకా పూర్తిగా లేదు దాదాపు సగము మాత్రమే అయినది. ఆ కొలది బోధనను వినుటలో అర్జునునిలో ఎంతో మార్పు వచ్చింది. అట్టి మార్పు వచ్చినదని తానే చెప్పాడు.ఆహా! సంసారవ్యాధికి గీతామృతం ఎంత చక్కటి మందు ! భవరోగపీడితుడగు అర్జునుడు గీతామృతమను ఔషధమును ఇప్పటికి ఒకింత మాత్రమే సేవించాడు. ఆ కొద్ది ఔషధముతోనే అర్జునునియందు ప్రత్యక్ష ఫలితము కానిపించింది. అతని భవరోగం పటాపంచలై పోయింది. మోహం అంతరించి

పోయింది.

సుబ్బన్న :- మామయ్యా! నేనెంతటి అదృష్టవంతుడ్ని! అట్టి మహోన్నత ఔషధమును త్రాగుటకు నాకు చక్కటి అవకాశము లభించింది. మీ పుణ్యమా అంటూ అట్టి గీతను విసే భాగ్యం నాకు కలిగింది. తరువాత ఏం జరిగిందో చెప్పు మామయ్యా !

గురవయ్య :- అర్జునుని ప్రార్థనను పురస్కరించుకొని శ్రీ కృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించారు. సుబ్బన్నా! గీతాబోధలో ఈ విశ్వరూప సందర్శన యోగానికి ఒక ప్రత్యేకత వుంది, ప్రాముఖ్యత వుంది. ఇంతవరకు శ్రీకృష్ణుడు బోధను చెప్పినారే కాని తన విశ్వవ్యాపక స్వరూపాన్ని చూపలేదు. ఇప్పుడు చూపుచున్నారు. ఈ విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములోని శ్లోకములలో ఎన్నియో బీజాక్షరములు వున్నవి. మరియు అర్జునుడు భగవానుని గూర్చి కావించిన చక్కని స్తోత్రము ఇందు వున్నది. కాబట్టి భక్తులు ఈ అధ్యాయమును విశేషముగా పారాయణం చేస్తుంటారు పుణ్యకాలాల్లో పఠిస్తూంటారు. సన్న్యాస స్వీకరణ శుభసమయంలో ఈ అధ్యాయమును పఠించే ఆచారం వుంది.

మీ విశ్వరూపం చూపించండి అని అర్జునుడు శ్రీకృష్ణుడ్ని ప్రార్థిస్తే వారు వెంటనే చూపలేదు. అర్జునునితో ఇలా అన్నారు. అర్జునా! ఈ భౌతిక నేత్రములతో నీవు నా విశ్వరూపాన్ని చూడలేవు. నీకు దివ్యనేత్రాలను అనుగ్రహిస్తున్నాను. ఆ దివ్యదృష్టి చేత నీవు ఆ విశ్వరూపాన్ని చూడగలవు - అని చెప్పి అర్జునునకు దివ్యదృష్టిని ప్రసాదించారు. శ్రీ వ్యాసుల వారియొక్క అనుగ్రహంతో సంజయునకు అక్కడ కూడ దివ్యదృష్టి కలుగగా అతడు ఇంటివద్దనే వుండి యుద్ధంలో జరిగే విషయాలన్నింటిని గురించి ధృతరాష్ట్రునకు తెలియజేశాడు. భగవానుడు విశ్వరూపాన్ని కూడ

సంజయుడు చూడకలిగి అద్దానిని గూర్చి ధృతరాష్ట్రునకు వివరించి చెప్పాడు.

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆహా! భగవానుని ఆ విశ్వ రూపం ఎంత ఆశ్చర్యకరంగా వుంది ! అనేక శిరస్సులతోను, అనేక దివ్యాభరణములతోను, అనేక ఆయుధములతోను, కూడి ఆ విశ్వరూపము ధగద్ధగాయమానముగా వెలుగుతుంది. వేలకొలది సూర్యులు ఒక్కసారి ఉదయిస్తే ఎంత కాంతి ఉద్భవిస్తుందో అంత కాంతివంతముగా ఆ స్వరూపము విరాజిల్లుతోంది. ఆ అనంత విశ్వరూపంలో ఈ ప్రపంచం ఒకానొక మూల అణగి వుంది.

ఆ విశ్వరూపం చూడగానే అర్జునునకు పరమాశ్చర్యం కలుగగా వారికి వినయ పూర్వకముగా చేతులు జోడించి ఇలా ప్రార్థించాడు - దేవా ! జగన్నాథా ! మీరు పెక్కు బాహువులు, శిరస్సులు, నేత్రములు, కలవారు. మీకు ఆదిగాని ,మధ్యముగాని, అంతముగాని లేదు. మీరు కిరీటధారులు, గదను ధరించినవారును, చక్రమును చేపట్టినవారు, మహాతేజస్స్వరూపులును, అపరిచ్ఛిన్నులును, అక్షరస్వరూపులును, సమస్త జగత్తునకు ఆధారభూతులును, నాశరహితులును, ధర్మమును కాపాడువారును, సనాతనులు, సూర్యచంద్రులు నేత్రములుగా కలవారును, భూనభోంతరాళముల నందంతటను సమస్త దిక్కులందును వ్యాపించిన వారును అయియున్నారు.

వ్యాపించిన దేవతలు మీయందు ప్రవేశించుచున్నారు. కొందరు మిమ్ములను స్తుతించుచున్నారు, సిద్ధులు, సాధ్యులు మున్నగు వారందరు మిమ్ములను ఆశ్చర్యముగా చూచుచున్నారు. ధృతరాష్ట్రుని కుమారులందరును, భీష్ముడును, ద్రోణుడును, కర్ణుడును, వారిసేనయందలి తదితరులును, మనసేన యందలి ప్రముఖులును, మీ

నోటియందు ప్రవేశించుచున్నారు.

ఏ ప్రకారము నదులు సముద్రమున చేరుచున్నవో ఆ ప్రకారమే ఈ మనుష్య లోకమందలి వీరులు మీ యందు ప్రవేశిస్తున్నారు. ఏ ప్రకారము మిడుతలు మండుచున్న అగ్నియందు పడుచున్నవో అట్లే జనులు మీ యందు ప్రవేశించుచున్నారు. దేవా ! భయంకర ఆకృతి గల మీరెవరో నాకు చెప్పుడు. మీకు నమస్కారము, నన్ను అనుగ్రహింపుడు.

సుబ్బన్నా! అర్జునుడు శ్రీకృష్ణమూర్తిని ఈ ప్రకారముగా ప్రార్థింపగానే దేవదేవుడగు ఆ పరమాత్మ అర్జునునితో ఇట్లు పలికినారు.

అర్జునా! నేను త్రిలోక సంహారకుడనగు కాలుడను, ప్రతి పక్ష సైన్యమునందుగల వీరులు నీవు యుద్ధము చేయకయున్నను జీవించియుండరు. కాబట్టి లెమ్ము! శత్రువులను జయించి కీర్తిని బడయుము, రాజ్యపమును అనుభవించుము. ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు మొదలైనవారందరును ఇదివరకే నాచే వధింప బడ్డారు. కాబట్టి నిమిత్త మాత్రుడుగా ఉండుము.

సుబ్బన్నా! శ్రీకృష్ణుని వాక్యములను వినిన తర్వాత అర్జునుడు చేతులు జోడించుకొని నమస్కరించి వినమ్రుడై ఇట్లా పలికాడు.

కృష్ణా! మీయొక్క నామము నుచ్చరించుట చేతను, మాహాత్మ్యమును తెప్పగ కొనియాడుటచేతను లోకము మిగుల సంతోషించుచున్నది. రాక్షసులు భీతిల్లి దిగంతములకు పరుగెత్తుచున్నారు. సిద్ధులు మీకు నమస్కరించుచున్నారు. మహాత్మా ! అనంతరూపా ! దేవదేవా ! జగదాశ్రయా ! స్థూలసూక్ష్మ జగత్తు రెండింటికిని పరమైనట్టి అక్షర పరబ్రహ్మ స్వరూపులు మీరై యున్నారు. మీరు బ్రహ్మదేవునికి కూడ ఆది

కారణ రూపులు. మీ చేతనే ఈ ప్రపంచమంతయు వ్యాపింపబడి యున్నది. మీకు అనేక వేల నమస్కారములు. సర్వరూపులగు ఓ కృష్ణా! ఎదుటను వెనుకను అన్నివైపులను మీకు నమస్కారము అపరిమిత సామర్థ్యము పరాక్రమము గల మీరు సర్వత్ర వ్యాపించి యున్నారు.

నాశరహితులగు ఓ కృష్ణా ! మీ యొక్క మహిమను తెలియక, పొరపాటున గాని, చనువు వలన గాని పరిహాసముగా నేనేదైనా పలికి యుండినచో అద్దానిని క్షమింపుడని వేడుకొనుచున్నాను. సాటిలేని ప్రభావము గల ఓ కృష్ణమూర్తీ ! మీరు ఈ చరాచర ప్రపంచమునకు తండ్రి అయి యున్నారు. మరియు పూజ్యులును, పరమ శ్రేష్టులగు గురువులును అయి యున్నారు. ముల్లోకములందును మీతో సమానమైన వారు లేరు. ఇక మిమ్ములను మించినవారు మరియొకరెట్లుండగలరు? దేవా ! కుమారుని తండ్రివలెను, స్నేహితుని స్నేహితుడు వలెను, ప్రియురాలిని ప్రియుడు వలెను మీరు నన్ను క్షమింపుడు. దేవా! ఇదివరకెన్నడును చూడనట్టి ఈ విశ్వరూపమును జూచి ఆనందమును పొందాను. ఇక నిపుడు మీ పూర్వపు సౌమ్యరూపమును చూపండి. దేవదేవా ! జగధాధారా ! అనుగ్రహించండి.

సుబ్బన్నా! అర్జునుడు ఈ ప్రకారంగా శ్రీకృష్ణుని ప్రార్థించిన తరువాత ఇట్లా చెప్పారు - ప్రకాశ స్వరూపమైనదియు జగద్రూపమైనదియు, అనంతమైనదియు, అగు ఈ విశ్వరూపమును నీవు తప్ప మరెవ్వరును ఈ మనుష్య లోకమున చూచియుండలేదు. "ఈ నా విశ్వరూపమును చూచి నీవేమియు భీతిల్ల వలదు" శ్రీకృష్ణుడు తన సౌమ్యరూపమును చూపగానే ఇప్పుడు నా మనస్సు కుదుటపడింది అని అర్జునుడు చెప్పాడు. ఆ తరువాత శ్రీకృష్ణమూర్తి ఇలా సెలవిచ్చారు --

అర్జునా ! ఈ నా విశ్వరూపము మహా దుర్లభమైనది. దేవతలు కూడా నిత్యము నద్దానిని చూడగోరుతుంటారు. ఇట్టి విశ్వరూపమును అనన్య భక్తిచేత మాత్రమే జనులు చూడగలరు. తెలిసికొనగలరు. నాలో ప్రవేశింపగలరు. అర్జునా! ఎవడు దైవకార్యములను చేయునో, దైవమునే ధ్యానించునో, దైవభక్తి కలిగి యుండునో, నిస్సంగుడై వ్యవహరించునో, దైవజ్ఞానమును పొందునో, ఏ ప్రాణి యెడల వైరము లేక యుండునో అట్టివాడు దైవమునే పొందును.

# భగవద్గీత

## 12వ అధ్యాయము

## భక్తియోగము

సుబ్బన్నా — మామయ్యా ! శ్రీకృష్ణమూర్తి అర్జునునకు విశ్వరూపం చూపించిన తర్వాత ఏమి బోధించారు?

గురవయ్య — సుబ్బన్నా! విశ్వరూపాన్ని చూపిన తరువాత అర్జునునకు ఒక సందేహం కలిగి శ్రీకృష్ణున్ని ఇలా ప్రశ్నించాడు - కృష్ణా! భగవంతుని యొక్క సాకారమును అర్చించువారు గొప్ప వారా లేక నిరాకారమును ధ్యానించువారు గొప్పవారా దయచేసి తెల్పండి.

అర్జునుని ఆ ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు భక్తియోగాన్ని గూర్చి చక్కగా ఉద్బోధించారు. వారు ఇలా బోధించారు - సాకారమా నిరాకారమా అనేది ప్రశ్నకాదు. శ్రద్ధతో అక్కార్యమును నిర్వర్తిస్తున్నారా అనేదే ప్రశ్న. సాకారోపాసకులు అయినప్పటికిని నిరాకార ధ్యాననిష్ఠులు అయినప్పటికిని శ్రద్ధా విశ్వాసములు కలిగియుండుట అతి ముఖ్యం. అర్జునా ! నాయందు మనస్సును నిలిపి నిరంతర దైవచింతనా పరులై మిక్కిలి శ్రద్ధతో గూడుకొనినవారై యెవరు నన్ను ఉపాసిస్తున్నారో వారే ఉత్తమ యోగులని నా యభిప్రాయము.

ఎవరు ఇంద్రియములన్నిటిని బాగుగా నిగ్రహించి ఎల్లెడల సమభావము గలవారై సమస్త ప్రాణులకును హిత మొనర్చుట యందాసక్తి గలవారై ఇట్టిదని నిర్దేశింప శక్యము కానిదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, చింతింపనలవి

కానిదియు, నిర్వికారమైనదియు, చలించనిదియు, నిత్యమైనదియు
అంతటను వ్యాపించియున్నదియు నగు అక్షర పరబ్రహ్మమును
ధ్యానిస్తున్నారో వారు నన్ను పొందుతున్నారు. అయితే దేహా
భిమానము గలవారికి నిర్గుణోపాసనా మార్గము ప్రయాసగా
వుంటుంది. అర్జునా ! ఎవరు సమస్త కర్మలను నాయందు సమ
ర్పించి, నన్నే పరమగతిగ దలంచినవారై, అనన్య చిత్తముతో నన్నే
ధ్యానించుచున్నారో, ఉపాసించుచున్నారో నాయందు చిత్తమును
జేర్చిన అట్టివారిని మృత్యురూపమగు ఈ సంసార సముద్రము
నుండి నేను శీఘ్రముగా లేవదీస్తున్నాను.

అర్జునా! సద్గతిని పొందటానికై పరమశాంతిని అనుభవించటా
నికై 4 పద్ధతులను చెప్తున్నాను. శ్రద్ధతో ఆలకించు.1) మొదటి
పద్ధతేమనగా నాయందే మనస్సును నిలుపు, నాయందే బుద్ధిని
ప్రవేశపెట్టు, అప్పుడు నాయందే నిలకడ చక్కగా సంభవిస్తుంది.2)
ఒకవేళ ఆ ప్రకారము మనస్సును నాయందు స్థిరముగా నిలుపు
టకు నీకు శక్తిలేనిచో అట్టి అభ్యాసయోగముచే నన్ను పొందుటకు
ప్రయత్నించు. ఇది రెండవ పద్ధతి.

3)ఒకవేళ ఆ అభ్యాసము చేయుట యందును నీవసమర్థుడవై
నచో దైవసంబంధములైన కర్మలను చేయుము. ఇది 3 వ పద్ధతి.
4) దీనిని కూడ ఆచరించుటకు శక్తుడవు కానిచో సమస్త కర్మముల
యొక్క ఫలములను త్యజించి వేయుము. ఇది 4 వ పద్ధతి.

అర్జునా! అభ్యాసము కంటె జ్ఞానము శ్రేష్ఠమైనది. జ్ఞానము
కంటె ధ్యానము ఉత్కృష్టమైనది ధ్యానము కంటే కర్మఫలత్యాగము
శ్రేష్టమైనది. అట్టి త్యాగముచే శాంతి లభిస్తుంది.

అర్జునా ! ఇక భక్తుని లక్షణములేవియో, భగవద్భక్తుడు
ఎట్లా ప్రయత్నించవారో చెప్తున్నాను విను - భక్తుడు ప్రపంచంలోని

ఏ ప్రాణికి బాధకలుగజేయకూడదు. సమస్త భూతకోట్ల యెడల మైత్రి, కరుణ కలిగియుండాలి. మమకారము గాని, అహంకారము గాని కలిగియుండరాదు, సుఖదుఃఖములందు సమభావము కలిగి వర్తించాలి. ఓర్పు కలిగి వుండాలి ఎల్లప్పుడు సంతుష్టాంతరంగుడై యుండాలి. ఆధ్యాత్మిక సాధనలందు నిరంతరము ప్రయత్నశీలుడై వుండాలి. దృఢమైన నిశ్చయమును కలిగి యుండాలి. మనో బుద్ధులను దైవమందే లగ్నం వేయాలి. భగవంతుని యందు అనన్య భక్తి కలిగి వుండాలి. అతని వలన లోకము భయమును పొందకూడదు. లోకమువలన అతడు భయమును పొంద కూడదు. కోపము, భయము, మనోవ్యాకులత మున్నగునవి కలిగి ఉండరాదు. కోరికలను త్యజించాలి. బాహ్యాభ్యంతర శుద్ధి కలిగి యుండాలి. కార్యసమర్థుడై వుండాలి. లోకవ్యవహారము లందు తటస్థుడై మెలగాలి. దిగులు లేకుండా వుండాలి. సమస్త కార్యములందును కర్తృత్వమును వదలి వేయాలి. ద్వంద్వ ములకు లోబడరాదు. శత్రుమిత్రాదులందు సమముగా వుండాలి. మానావమానములందును, నిందాస్తుతులందును ,శీతోష్ణములయం దును, సుఖదుఃఖములందును సమభావము కలిగి వుండాలి. దేనియందును సంగము కలిగి యుండరాదు. మౌనవ్రతాన్ని శీలిస్తూ వుండాలి. భగవంతుడు ఒసంగినదానిలో సంతృప్తిని బడయు చుండాలి. నిశ్చయమగు బుద్ధి కలిగి వుండాలి. అర్జునా! ఇట్టి సుగుణములు కల భక్తుడు నాకు ప్రియుడు.

ఎవరు శ్రద్ధావంతుడై దైవమునే పరమగతిగా ఎంచి అమృత రూపములగు ఈ ధర్మములను అనుష్ఠిస్తారో అట్టివారు నాకు మిక్కిలి ఇష్టులు.

గురవయ్య - సుబ్బన్నా ! ఈ ప్రకారంగా శ్రీ కృష్ణ మూర్తి భక్తినిగూర్చి భక్తుని లక్షణములను గూర్చి అద్భుతముగా

సెలవిచ్చారు.

సుబ్బన్న -- మామయ్యా ! ఇంతవరకు నేను భక్తి అంటే
ఏవో పూవులు ఆకులు సమర్పించి పూజచేయుట మనుకున్నా
ఇప్పుడు భగవద్వాక్యముల ద్వారా సద్గుణాలు కలిగియుండుటయే
ఉత్తమమగు భక్తి అని తెలుసుకున్నా.

గురవయ్య - సుబ్బన్నా ! ఫలపుష్పాదులతో దేవుని పూజించుట
సామాన్యమైన భక్తి. సద్గుణాలు కలిగి వుండటం విశేషభక్తి. శ్రీకృష్ణ
పరమాత్మ భగవద్గీతలో ఈ విశేష భక్తిని గూర్చియే పేర్కొన్నారు.
భగవద్గీతలో ఇప్పటికి 2వ షట్కము (భక్తి షట్కము) పూర్తయింది.

# భగవద్గీత

## 13వ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

సుబ్బన్న - మామయ్యా! భక్తియోగం బోధించిన తరువాత గీతాచార్యులు అర్జునునకు ఏమి తెలియజేశారు? ఈ బోధలు వింటుంటే నాకు పరమానందం కలుగుతుంది. ఇంకను వినాలని కుతూహలం జనిస్తుంది.

గురవయ్య - సుబ్బన్నా! భక్తియోగం తరువాత భగవానుడు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగాన్ని గూర్చి వివరించి చెప్పారు. ఇది అఖండమైన జ్ఞానోపదేశము. మన చదువులలో ఇది కాలేజీ కోర్సు వంటిది. అన్ని యోగాలు ఈ జ్ఞానయోగంతో మిళితమై పోతాయి. జ్ఞానం చేత మోక్షం లభిస్తుంది. స్వస్వరూప జ్ఞానం వుదయిస్తుంది .అదే చివరి సాధన. సుబ్బన్నా! భక్తియోగాన్ని గూర్చి వినగానే అర్జునునకు జ్ఞానయోగాన్ని గూర్చి తెలుసుకోవాలని కుతూహలం కలిగి 6 ప్రశ్నలు ఒకేసారి అడిగేసినాడు

ప్రకృతి అనగా ఏమి, పురుషుడనగా ఎవరు, క్షేత్రమనగా ఏమి, క్షేత్రజ్ఞుడనగా ఎవరు, జ్ఞానమనగా నేమి, జ్ఞేయమనగా నేమి? తెలుపుడని అర్జునుడు శ్రీకృష్ణుని అర్థించాడు.

శ్రీకృష్ణుడు ఇలా జవాబిచ్చారు - నాయనా! అర్జునా! ఈ శరీరమే క్షేత్రము. దీనిని తెలుసుకునే వాడు క్షేత్రజ్ఞుడు. సమస్త ప్రాణికోట్లలో క్షేత్రజ్ఞుడను నేనే (ఆత్మయే) ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల గూర్చిన జ్ఞానమే జ్ఞానములలో కెల్లా ఉత్కృష్టమైన జ్ఞానము.

ఇక క్షేత్రమంటే ఏమిటో విపులంగా చెప్తాను విను. క్షేత్రమంటే ఒక్క దేహమే కాదు పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి

మూలప్రకృతి, 11 ఇంద్రియములు, 5 ఇంద్రియ విషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాదుల సముదాయము, తెలివి, ధైర్యము ఇవన్నియు చేరి క్షేత్రమనబడతాయి. ఇది దృశ్యము జడమైనది, వికారవంతమైనది, నశ్వరమైనది క్షేత్రజ్ఞుడు చైతన్యవంతుడు, నిర్వికారుడు, అవినాశి.

అర్జునా! జ్ఞానమంటే ఏమిటో చెప్తాను విను - తనను తాను పొగడుకొనకుండుట, డంబము లేకుండుట, పరప్రాణులను బాధింపకుండుట, ఓర్పు గలిగియుండుట, ఋజుత్వము, స్థిరముగా నుండుట, మనస్సును బాగుగా నిగ్రహించుట, ఇంద్రియ విషయము లందు, శబ్దస్పర్శాదులందు విరక్తి కలిగి యుండుట, అహంకారము లేకుండుట, పుట్టుక, చావు, ముసలితనము, రోగము అనువానివలన కలుగు దుఃఖమును, దోషమును మాటిమాటికి స్మరించుట, కొడుకులు, భార్య, ఇల్లు మున్నగువానియందు ఆసక్తి లేకుండుట మరియు వాటిలో తగుల్కొనక యుండుట, ఇష్టానిష్టములు సంప్రాప్తించినపుడెల్లపుడును సమబుద్ధి కలిగియుండుట, నాయందు అనన్యమైన భక్తి కలిగియుండుట, ఏకాంత ప్రదేశమును ఆశ్రయించుట, జనసమూహమందు ప్రీతిలేకుండుట, అధ్యాత్మజ్ఞానము నిరంతరము కలిగియుండుట, తత్త్వజ్ఞానము యొక్క గొప్ప ప్రయోజనమును తెలిసికొనుట - ఇవన్నియు చేరి జ్ఞానమనబడతాయి.

అర్జునా! ఇక జ్ఞేయమును గూర్చి చెప్పుతున్నాను విను - ఏది తెలియదగిన బ్రహ్మస్వరూపమో, దేనిని తెలిసికొని మనుజుడు అమృతస్వరూపమగు మోక్షమును పొందుతాడో అదియే ఆత్మ అదియే బ్రహ్మము. ఆదిలేనట్టి పరబ్రహ్మమనబడు, అయ్యది సత్తని గాని అసత్తనిగాని చెప్పబడదు. అది అంతటను చేతులు, కాళ్ళు, గలదియు అంతటను కన్నులు, తలలు, ముఖములు గలదియు, అంతటను చెవులు గలదియునయి ప్రపంచమునందు సమస్తమును

ఆనందించి యున్నది. ఆ బ్రహ్మము సమస్తములైన ఇంద్రియములు లేనిదియు, దేనిని అంటనిదియు, గుణములననుభవించునదియు, కదలనిదియు, కదులునదియును, అతి సూక్ష్మమై యుండుటవలన తెలియబడనిదియు, దూరముగా నుండునదియు, దగ్గరగా కూడ నుండునదియు, విభజింప బడనిది యైనను ప్రాణులందు విభజింపబడిన దానివలె నున్నదియు, ప్రాణులను సృష్టించునదియు, పోషించునదియు, లయింపజేయునదియు, అని తెలిసికొనదగినది. మఱియు అది ప్రకాశించెడు సూర్యచంద్రాగ్న్యాది పదార్థములకు గూడ ప్రకాశమునిచ్చునదియు, తమస్సు కంటె వేరైనదియు, తెలియదగినదియు, జ్ఞానగుణములచే బొందదగినదియు, సమస్త ప్రాణులయొక్క హృదయమునందు విశేషించి యున్నదియునని చెప్పబడుచున్నది. అర్జునా! ఈ ప్రకారముగా క్షేత్రమును గూర్చియు, క్షేత్రజ్ఞుని గూర్చియు జ్ఞానమును గూర్చియు జ్ఞేయమును గూర్చియు సంక్షేపముగా చెప్పాను. నా భక్తుడు దీనిని గూర్చి తెలిసికొని నా స్వరూపమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

అర్జునా! ఇక ప్రకృతి పురుషులను గూర్చి చెప్పచున్నాను వినుము. ప్రకృతిని, పురుషుని ఆదిలేనివిగా తెలిసుకో. వికారములు గుణములు ప్రకృతి నుండి కలుగుతుంటాయి. ప్రకృతి యందున్న వాడై పురుషుడు ప్రకృతి వలన బుట్టిన గుణములను అనుభవిస్తున్నాడు. ఆయా గుణములతోడి కూడికయే ఈ జీవునకు ఉత్తమ, నికృష్ట జన్మములెత్తుట యందు హేతువై యున్నది. పురుషుడు ఈ శరీరమందున్న స్పటిక శరీరము కంటె వేరై యున్నాడు. అతడు సాక్షిభూతుడు, అతడే సాక్షాత్ పరమేశ్వరుడు. సమస్తమును భరించువాడు అతడే. ఆత్మానాత్మ జ్ఞానమువలన మనుజునకు జన్మరాహిత్యము సిద్ధిస్తున్నది.

అర్జునా! ఆత్మను కొందరు శుద్ధమగు మనస్సుచే ధ్యాన

యోగము ద్వారాను, మరికొందరు సాంఖ్యయోగము ద్వారాను, ఇంక కొందరు కర్మయోగము ద్వారాను తెలుసుకొనుచున్నారు. మరికొందరు ఇతరుల వలన తెలిసికొని వారివద్ద శ్రవణము చేసి ఉపాసిస్తున్నారు. శ్రవణ తత్పరులగు అట్టివారు కూడ మృత్యువును దాటివేస్తున్నారు.

అర్జునా ! ఈ ప్రపంచమున స్థావర జంగమాత్మకమగు పదార్థమేది పుట్టుచున్నదో, అదియంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల కూడికవల్లనే కలుగుచున్నదని తెలిసికో. సమస్త ప్రాణులందును సమముగ నున్నట్టి పరమాత్మను ఆయా ప్రాణుల దేహాదులు నశించినను నశింపని దానినిగ ఎవడు చూస్తున్నాడో అతడే నిజముగ చూచువాడగును! ఎవడు కర్మ గలను ప్రకృతి చేతనే సర్వవిధముల చేయబడుచున్నట్లు గను, అట్లే ఆత్మను కర్త కానిదానిగను, చూచుచున్నాడో అతడే నిజముగ చూచుచున్నవాడగును.

అర్జునా! ఆది లేనివాడు అగుటచేతను, గుణరహితుడు అగుటవలనను ఈ పరమాత్మ శరీరమునందున్నప్పటికిని ఏమియు చేయుకయు, దేనిచేతను అంటబడకయునున్నారు. సర్వత్ర వ్యాపించి యున్న ఆకాశము సూక్ష్మమగుట వలన ఏ ప్రకారముగ అంటబడదో, ఆప్రకారమే శరీరమందంతటను వెలయుచున్న పరమాత్మ అంటబడక నున్నారు.

సూర్యుడొక్కడే ఈ సమస్త లోకమును ఎట్లు ప్రకాశింపజే యుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఈ సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయు చున్నారు. ఎవరు జ్ఞానదృష్టిచేత క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క బేధమును చక్కగా తెలిసికొంటారో మరియు ప్రకృతి నుండి విముక్తిని బొందు వుపాయమును తెలిసికొంటారో వారు పరమాత్మ పదమును పొందుతారు.

# భగవద్గీత
## 14వ అధ్యాయము
## గుణత్రయ విభాగయోగము

సుబ్బన్న -- మామయ్యా ! క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగాన్ని గూర్చి ముచ్చటించిన పిదప శ్రీకృష్ణమూర్తి అర్జునునకు ఏమి బోధించారు?

గురవయ్య -- గుణత్రయ విభాగయోగాన్ని గూర్చి వర్ణించి చెప్పారు. బోధనను ప్రారంభిస్తూ వారు ఇట్లా అన్నారు. అర్జునా! దేనిని తెలిసికొని ముముక్షువులు ఈ సంసారబంధము నుండి విడివడి సర్వోత్తమమగు మోక్షసిద్ధిని బడసిరో అట్టి పరమాత్మక విషయమైనదియు, జ్ఞానములలో కెల్లా నుత్తమమైనదియునగు జ్ఞానమును చెప్పున్నాను వినుము - ఈ జ్ఞానమును గూర్చి తెలిసికు న్నవారు సృష్టికాలమున జన్మింపరు, ప్రళయకాలమున మరణించరు వారు నాలో ఐక్యమును పొందుతారు.

అర్జునా! మూలప్రకృతి యందు నేను చైతన్య రూపమగు బీజమును వుంచుటవలన సమస్త ప్రాణుల యొక్క ఉత్పత్తి సంభ విస్తున్నది. అర్జునా! సత్త్వరజస్తమో గుణములలో సత్త్వగుణము నిర్మలమైనదగుట వలన ప్రకాశమును గలుగజేయునదియు ఉపద్ర వములేనిదియు, సుఖమునందలి ఆసక్తిచేతను, జ్ఞానము నందలి ఆసక్తిచేతను జీవుని బంధించివేస్తున్నది. రజోగుణము దృశ్య విష యముల యెడల ప్రీతిని గలుగజేయునదియు, తృష్ణను, ఆసక్తిని జనింపచేయునదియని తెలిసికో అది కర్మములందలి ఆసక్తిచేత ఆత్మను లెస్సగ బంధించి వేస్తున్నది. తమోగుణము అజ్ఞానము వలన కలుగునదియు, సమస్త ప్రాణులకును, మోహమును గలుగ

జేయునదియునని తెలిసికో. అయ్యది మరపు, సోమరితనము, నిద్ర మొదలగువానిచే జీవుని తెస్సగ బంధించి వేస్తున్నది. సత్త్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మమునందును తమోగుణము జ్ఞానమును కప్పివైచి ప్రమాదమునందు జీవుని చేరుస్తున్నవి.

అర్జునా! సత్త్వగుణము రజోగుణ, తమోగుణములను అణగద్రొక్కి ప్రవర్తిస్తుంది. అట్లే రజోగుణము సత్త్వగుణ తమోగుణములను, తమోగుణము సత్త్వగుణ రజోగుణములను అణగద్రొక్కి ప్రవర్తిస్తవి. ఎప్పుడీ శరీరమునందు శ్రోత్రాది ఇంద్రియ ద్వారములన్నిటియందును ప్రకాశరూపమగు జ్ఞానము కలుగు చున్నదో, అప్పుడు సత్త్వగుణము బాగుగా వృద్ధి నొందియు న్నదని తెలుసుకో. రజోగుణమభివృద్ధి నొందినపుడు మనుజు నియందు లోభత్వము కార్యములందు ప్రవృత్తి, కర్మములను ప్రారంభించుట, మనశ్శాంతి లేకుండుట, ఆశ అనునవి ఏర్ప డుతుంటాయి. తమోగుణము అభివృద్ధి పొందినపుడు మనుజుని యందు అవివేకము, సోమరితనము, అజాగ్రత, అజ్ఞానము, అనునవి పుడుతుంటాయి.

అర్జునా! ఎప్పుడు జీవుడు సత్త్వగుణము అబివృద్ధిని పొందిన పుడు మరణించునో, అప్పుడతడు ఉత్తమ జ్ఞానముగల వారియొక్క పరిశుద్ధములైన లోకములనే పొందుతాడు. రజోగుణము అభివృద్ధి నొందియుండగా మరణించువాడు కర్మాసక్తులగు వారిఇళ్ళయందు జన్మిస్తాడు. అట్లే తమోగుణము అభివృద్ధి నొందియుండగా మరణిం చువాడు పామరుల గర్భములందు లేక పశుపక్ష్యాది హీనజాతులందు పుడ్తాడు.

సాత్త్వికమైన కర్మమునకు సత్త్వగుణ సంబంధమైన నిర్మలమైన సుఖము ఫలము, రజోగుణసంబంధమైన కర్మమునగు దుఃఖము ఫలము. తమోగుణసంబంధమైన కర్మకు అజ్ఞానము ఫలము.

సత్త్వగుణ సంబంధమైన కర్మకు జ్ఞానము ఫలము. సత్త్వగుణమువలన జ్ఞానము, రజోగుణము వలన లోభము, తమోగుణము వలన అజాగ్రత్త, భ్రమ, అజ్ఞానము కలుగుతూంటాయి. సత్త్వగుణము గలవారు ఊర్ధ్వలోకముల కేగుతూంటారు. రజోగుణముగలవారు మధ్యమమగు మనుష్యలోకమున జన్మిస్తూంటారు. నీచగుణప్రవృత్తి గల తమోగుణయుతులు అధోలోకమును పొందుతారు.

అర్జునా! ఎప్పుడు వివేకవంతుడు గుణముల కంటే నితరమును కర్తగా నెంచడో, మఱియు తనను గుణములకంటే వేరగు వానినిగ తెలిసికొనుచున్నాడో, అపుడాతడు నా స్వరూపమును పొందుచున్నాడు. జీవుడు దేహోత్పత్తికి కారణభూతములగు ఈ మూడు గుణములను దాటినపుడు పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు అను వాటిని త్యజించి వేసి మోక్షమును పొందుతాడు.

గురవయ్య - సుబ్బన్నా! శ్రీకృష్ణ పరమాత్మ త్రిగుణములను గూర్చి ఈ ప్రకారం చక్కగా బోధిస్తూండగా అర్జునకు ఒక సందేహం కలిగి గీతాచార్యులను ఇలా ప్రశ్నించాడు. కృష్ణా! ఈ మూడు గుణాలు దాటినవాడు ఎట్టి లక్షణాలు కలిగివుంటాడు? ఎట్టి ప్రవర్తన కలిగియుంటాడు? మఱియు ఈ మూడు గుణాలను అతడే విధంగా దాటివేయగలుగుతాడు? ఆ మూడు గుణాలు దాటినవాడు ఏయే గుర్తులను కలిగి ఉంటాడో దయచేసి తెల్పండి.

గురవయ్య - సుబ్బన్నా! అర్జునుని ఆ ప్రశ్నలను పురస్కరించుకొని శ్రీకృష్ణమూర్తి ఇలా ప్రత్యుత్తరమిచ్చారు. అర్జునా! త్రిగుణములను దాటినవాడు నేను చెప్పబోయే ఈ లక్షణాలు కలిగి వుంటాడు. అతడు తనకు సంప్రాప్తములైన సత్త్వగుణ సంబంధమగు ప్రకాశమునుగాని, రజోగుణ సంబంధమగు కార్యప్రవృత్తినిగా-ని, తమోగుణ సంబంధమగు మోహమును గాని ద్వేషింపక, అవి తొలగిపోయినచో వాటిని అపేక్షింపక తటస్థుడుగా వుంటాడు.

గుణములచేత చలింపజేయబడడు. నిశ్చలుడై వుంటాడు. అతడు సుఖదుఃఖములందు సమభావము కలిగి ఉంటాడు. ఆత్మయందే స్థిరంగా నెలకొని వుంటాడు. మట్టిగడ్డ, రాయి, బంగారములందు సమబుద్ధి కలిగి వుంటాడు. మానావమానములందును, నిందాస్తుతులందును, ఇష్టానిష్టములందును సమభావము కలిగి ఉంటాడు. ధైర్యవంతుడై వుంటాడు. సమస్త కారణములందును కర్తృత్వ బుద్ధిని వదలి వేస్తాడు.

అర్జునా! ఎవడు నన్నే (ఆత్మనే) అచంచలమైన భక్తియోగముచేత సేవిస్తాడో అతడు గుణములన్నిటిని తెస్సగా దాటివైచి బ్రహ్మముగానగుటకు సమర్థుడగుచున్నాడు. అర్జునా! నేను నాశనరహితమును, నిర్వికారమును, శాశ్వత ధర్మస్వరూపమును, నిరతిశయ ఆనంద స్వరూపమును అగు బ్రహ్మమునే అయియున్నాను.

# భగవద్గీత
# 15వ అధ్యాయము
# పురుషోత్తమప్రాప్తి యోగము

సుబ్బన్న - మామయ్యా ! గుణత్రయ విభాగమును గూర్చి వర్ణించి చెప్పిన తర్వాత శ్రీకృష్ణమూర్తి అర్జునునకు ఏమి బోధించారు ?

గురవయ్య - సుబ్బన్నా !3 గుణములను గూర్చి చక్కగా వివరించి తెల్పిన తర్వాత భగవంతుడు పురుషోత్తమ ప్రాప్తి యోగాన్ని గూర్చి చక్కగా తెలిపారు. పురుషోత్తముడనగా భగవంతుడు. క్షరాక్షరములకు అతీతుడగు అట్టి భగవంతుని జీవుడు ఏ విధంగా పొందగలడో ఇప్పుడు శ్రీ కృష్ణమూర్తి వివరించి చెప్తున్నారు.

మొట్టమొదట ఒక చెట్టును గూర్చి తెలిపారు. అదే సంసార వృక్షము అది అన్ని చెట్లమోస్తరు వుండదు. తలక్రిందులుగా వుంటుంది. అది వ్రేళ్ళు పైన, కొమ్మలు క్రింద కలిగి వుంటుంది. ఆ చెట్టుయొక్క కొమ్మలు గుణములచే వృద్ధి బొందింపబడినవి. విషయములేగాని చిగుళ్ళు, ధృఢముగా నాటుకొనబడి యున్న ఈ సంసార వృక్షాన్ని అసంగమను శస్త్రముచే ఛేదించి వేయాలి. ఆ పిమ్మట పునరావృత్తి రహితమగు శాశ్వత ఆత్మపదము కొరకై ప్రయత్నించాలి.

ఇక్కార్యమును సాధించుటకై సాధనలు చేయాలి. అభిమానము అవివేకము కలిగియుండరాదు. నిస్సంగులై వ్యవహరించాలి, నిరంతరము అధ్యాత్మ విద్యను అభ్యసిస్తూ వుండాలి, కోరికలన్నీ తెస్సగా తొలగించి వేయాలి, సుఖదుఃఖములనెడి దంద్వముల నుండి బాగుగా తవబడాలి. ఇట్టి పచ్ఛీలురగు జ్ఞానులు నాశ

రహితమగు బ్రహ్మపదమును పొందుతారు.

ఆ పరమాత్మను సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయుజాలరు. దేనిని పొందితే మరల తిరిగిరారో అదియే భగవంతుని యొక్క శ్రేష్ఠమైన స్థానము. జీవుడు భగవంతుని యొక్క ఒకానొక అంశము. జీవుడు శరీరమును విడుచునపు డును, నూతన శరీరమును పొందునపుడును పుష్పాది స్థానముల నుండి గాలి వాసనలను గ్రహించి పోవునట్లు పంచేంద్రియములు, మనస్సు అను ఆరింటిని గ్రహించివెడలుచున్నాడు ఈ జీవుడు చెవిని, కంటిని, చర్మమును, నాలుకను, ముక్కును, మనస్సును ఆశ్రయించి విషయములను అనుభవించుచున్నాడు. పరమాత్మను అజ్ఞానులు చూడజాలకున్నారు. జ్ఞానదృష్టి కలవారు చక్కగా చూస్తున్నారు. తెలుసుకుంటున్నారు. చిత్తశుద్ధి కలవారు ప్రయ త్నము చేత ఆత్మను చూడగలుగుతున్నారు. చిత్తశుద్ధి లేనివారు ప్రయత్నము చేసినను చూడజాలకున్నారు.

సూర్యుని యందుగాని, చంద్రునియందుగాని, అగ్నియందుగాని ఏ తేజస్సు కలదో అవియంతయు ఆత్మతేజే అయియుంది ఆ పరమాత్మ భూమియందు ప్రవేశించి సమస్త ప్రాణికోట్లను ధరించుచున్నాడు. ఆ పరమాత్మయే రసస్వరూపుడగు చంద్రుడై సస్యములన్నింటిని పోషించుచున్నారు. ఆ పరమాత్మయే జఠరాగ్ని రూపమున శరీరమును ఆశ్రయించి 4 విధములగు అన్నమును పచనము చేయుచున్నారు. భగవంతుడగు ఆ పురుషోత్తముడు సమస్త ప్రాణులయొక్క హృదయమందు నివశించు చున్నారు. వారివలననే జ్ఞాపకశక్తి, జ్ఞానము కలుగుచున్నవి. వేదములన్నిటి చేతను ఆభగవంతుడే తెలియదగినవాడు. వేదము నెరిగినవారు కూడ వారే అయియున్నారు. వేదమును సృష్టించినవారు కూడ ఆ పరమాత్మయే.

ఈ ప్రపంచమునందు క్షరుడనియు, అక్షరుడనియు పురుషోత్తముడనియు ముగ్గురు కలరు. దేహాభిమాని క్షరుడు, చిత్తాభిమాని అక్షరుడు. వీరిరువురి కంటే వేరైనవారు పురుషోత్తముడు వారే పరమాత్మ. వారు 3 లోకములను వ్యాపించి ప్రపంచమునంతటిని భరిస్తున్నారు. వారు అవ్యయులు సాక్షాత్ ఈశ్వరుడు, ఆ పరమాత్మ క్షరాక్షరముల రెండింటిని మించినవారు కాబట్టి ప్రపంచమునందును వేదములందును పురుషోత్తముడు అని ప్రసిద్ధికెక్కియున్నారు. ఎవడు అజ్ఞానము లేనివాడై ఆ భగవంతుని పురుషోత్తమునిగ నెరుగుచున్నాడో అతడు సమస్తమును తెలిసిన వాడగుచు పరిపూర్ణ మనస్సుతో ఆ భగవంతుని భజించుచున్నాడు. అర్జునా! ఈ ప్రకారముగా మహారహస్యమైన శాస్త్రవిషయాన్ని నేను నీకు చెప్పాను. దీన్ని చక్కగా తెలిసికొనిన వాడు జ్ఞానవంతుడును, కృతకృత్యుడును అగుతాడు.

గురవయ్య - సుబ్బన్నా! శ్రీకృష్ణపరమాత్మ బోధించిన ఈ పురుషోత్తమ ప్రాప్తి యోగమునందు భోజనమునకు సంబంధించిన వైశ్వానరాగ్ని మొదలయిన విషయాలు వున్నందువల్ల ఈ అధ్యాయాన్ని జనులు భోజనకాలంలో పఠించే సంప్రదాయం వుంది.

# భగవద్గీత
# 16వ అధ్యాయము
# దైవాసుర సంపద్విభాగయోగము

సుబ్బన్న - మామయ్యా ! పురుషోత్తమ ప్రాప్తి యోగమును గూర్చి చెప్పిన తర్వాత శ్రీకృష్ణమూర్తి అర్జునునకు ఏమి బోధించారో తెలుపుతావా ?

గురవయ్య - చెప్తాను విను దైవాసుర సంపద్విభాగయోగాన్ని గూర్చి గీతాచార్యులు ప్రస్తావించారు. మానవుడు తరించాలంటే మంచి గుణాలను అలవరుచుకోవాలి. చెడ్డగుణాలను వదిలివే యాలి. కాబట్టి రెండింటిని గూర్చి తెలుసుకోవటం మంచిదని శ్రీ కృష్ణపరమాత్మ దైవీ సంపద అసుర సంపదను గూర్చి వర్ణించి చెప్పారు. సంపద అనగా ఐశ్వర్యం .సద్గుణాలే నిజమైన ఐశ్వర్యము. అవేమానవునకు చక్కని ఆభరణాలు. సుబ్బన్నా! మొట్టమొదట గీతాచార్యులు 26 దైవగుణాలను పేర్కొన్నారు.

అవి ఏవనగా 1) భయము లేకుండుట, 2) అంతఃకరణ శుద్ధి, 3) జ్ఞానయోగమునందుండుట, 4) దానము, 5) ఇంద్రియ నిగ్రహము, 6) (జ్ఞాన) యజ్ఞము, 7) (వేదశాస్త్రాదులు) అధ్యయ నము, 8) తపస్సు, 9) ఋజుత్వము, 10) ఏ ప్రాణికిన్ని బాధ కలుగజేయుకుండుట, 11) సద్వస్తువగు పరమాత్మ నాశ్రయించుట, (లేక) నిజము పలుకుట ,12) కోపము లేకుండుట, 13) త్యాగబుద్ధి కలిగియుండుట, 14 ) శాంతి స్వభావము, 15) కొండెములు చెప్పకుండుట, 16) ప్రాణులందు దయ కలిగియుండుట, 17) విషయలోలత్వము లేకుండుట అనగా విషయములందాసక్తి లేకుం డుట, వానిచే చలింపకుండుటయు, 18) మృదుత్వము, 19) సిగ్గు,

20) చంచల స్వభావము లేకుండుట, 21) ప్రతిభ, 22) ఓర్పు, 23) ధైర్యము, 24) బాహ్యాభ్యంతర శుచిత్వము, 25) ఎవనికిని ద్రోహము చేయకుండుట, 26) ద్రోహ చింతనము లేకుండుట,స్వాతిశయము లేకుండుట. అను సుగుణములు దైవసంపత్తికల వానికి పుట్టుచున్నవి.

సుబ్బన్నా! ఈ ప్రకారంగా దైవగుణాలను గూర్చి వర్ణించి చెప్పిన తరువాత శ్రీకృష్ణుడు 6 అసురగుణాలను గూర్చి ఈ ప్రకారంగా వర్ణించి చెప్పారు. 1) డంబము, 2) గర్వము, 3) అభిమానము, 4) కోపము, 5) కాఠిన్యము, 6) అవివేకము- అను దుర్గుణములు అసుర సంపత్తియందు పుట్టినవానికి కలుగుచున్నవి. మరియు ఇలా అన్నారు- అర్జునా! దైవీసంపద వలన పూర్ణ బంధనివృత్తిని అసురాసంపద గొప్ప బంధమును గలుగజేయునని తెలుసుకో. అర్జునా నీవు దైవీసంపద యందు పుట్టావు కాబట్టి ఇక శోకించవలసిన పని లేదు.

అర్జునా! దైవగుణములను గూర్చి విపులంగా చెప్పాను. ఇక అసుర సంపదగల వానియొక్క స్వభావాన్ని గూర్చి వివరించి చెప్తాను విను. అసుర గుణములు కలవారు ధర్మప్రవృత్తిని గాని, అధర్మనివృత్తిని గాని యెఱుంగరు. వారియందు శుచిత్వముగాని, ఆచారముగాని, సత్యము గాని యుండదు. వారు ఈశ్వరుడు లేడనియు, ప్రాణికోట్లు స్త్రీపురుష సంయోగం వలననే ఏర్పడినవనియు ఈ జగత్తునకు వేఱు కారణం లేదనియు చెప్పుతుంటారు. వారు నాస్తిక దృష్టిని అవలంబిస్తారు. వారు చెడినమనస్సు గలవారై, అల్పబుద్ధితో కూడియున్న వారును, క్రూర కార్యములను చేయువారును, శత్రువులును అయి ప్రపంచము యొక్క వినాశము కొరకు జన్మిస్తున్నారు. వారు తనివితీరని కామము నాశ్రయించి, డంబము, అభిమానము, మదము గలవారలై అవివేకము వలన చెడు పట్టుదలనాశ్రయించి, అపవిత్రములగు

వ్రతములు గలవారై ప్రవర్తిస్తున్నారు. మరియు వారు అపరి
మితమైనదియు, మరణము వరకు విడరానిదియు అగు విషయ
చింతను ఆశ్రయిస్తూ వుంటారు. వారు కామోపభోగమే పరమ
పురుషార్థమని భావిస్తూ వుంటారు. వారు పెక్కు ఆశాపాశములచే
బంధింపబడుతూ ఉంటారు. వారు కామక్రోధాదులనే ఎక్కువగా
ఆశ్రయిస్తూంటారు. మరియు వారు కామములననుభవించటానికై
అన్యాయంగా డబ్బు సంపాదిస్తుంటారు.

అసురసంపద గలవారు వారు ఈ విధంగా తలపోస్తుంటారు.

"నేను ఈ కోరికను ఇపుడు పొందాను, ఈ కోరికను ఇక
మీదట పొందగలను, ఈ ధనము ఇపుడు నాకు వున్నది, ఇంకను
ఎంతయో ధనాన్ని నేను సంపాదిస్తాను, ఈ శత్రువును నేను ఇప్పుడు
వధించను, తక్కిన శత్రువులను కూడ వధిస్తాను, నేను ప్రభువును,
సమస్త భోగములను అనుభవించువాడను, తలంచిన కార్యము
నెరవేర్చుటకు శక్తి గలవాడను, బలవంతుడను, సుఖవంతుడను,
ధనవంతుడను, గొప్ప వంశమున పుట్టాను. నాతో సమానమైన
వాడు మరొక డెవడునూ లేడు. నేను యజ్ఞములను చేస్తాను,
దానములనిస్తాను, ఆనందాన్ని అనుభవిస్తాను- అని ఈ ప్రకారంగా
అజ్ఞానంచే మోహమును పొందినవారును, అనేక విధములయిన
చిత్త చాంచల్యములతో కూడిన వారును, మోహమను
వలచే బాగుగా కప్పబడినవారును కామమును అనుభవించుట
యందు మిగుల ఆసక్తిగల వారును అయి వారు అపవిత్రమైన
నరకములందు పడుతున్నారు."

అర్జునా! అసురగుణములు కలవారు తమ్ము తాము గొప్పగ
తలుస్తూంటారు, వినయమనేది వారిలో వుండనే వుండదు. ధనము
కలదని అభిమానముతోను, మదముతోను కూడి యుంటారు. వారు
అహంకారమును, బలమును, గర్వమును, కామమును, క్రోధమును
లెస్సగ ఆశ్రయిస్తూ వుంటారు. తమ శరీరములందును, ఇతరుల

శరీరములందున్న భగవంతుని ద్వేషిస్తూంటారు. అసూయ కలిగి వుంటారు, వారు డంబముతో శాస్త్రవిరుద్ధముగా నామమాత్రపు యజ్ఞములను చేస్తుంటారు. అర్జునా! భగవంతుని ద్వేషించే వారును, క్రూరులును, మనుజాధములును అగు అట్టివారిని నేను జనన మరణ రూపములగు ఈ సంసారమార్గములందు అసుర సంబంధమైన నీచజన్మలందు పడవేస్తాను. అసురసంబంధమైన నీచ జన్మలను పొందిన అట్టివారు ప్రతిజన్మయందును అంతకంటే నీచమైన స్థితిని పొందుతుంటారు.

అర్జునా! కామము, క్రోధము, లోభము అను ఈ 3 దుర్గుణాలు నరకద్వారాలు. ఇవి ఆ దుర్గుణములు కలవారిని నాశనం చేస్తాయి. కాబట్టి వాటిని త్యజించి వేయాలి. ఈ 3 నరకద్వారముల నుండి బాగుగా విడువ బడిన మనుజుడు తనకు హితమును కలుగచేసుకుంటున్నాడు. మరియు సర్వోత్కృష్టమగు మోక్షస్థితిని పొందుచున్నాడు.

అర్జునా! ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తన యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తాడో అట్టివాడు పురుషార్థ సిద్ధినిగాని, సుఖమును గాని, ఉత్తమ గతియగు మోక్షమును గాని పొందనేరడు. కావున ఏది చేయాలో, ఏది చేయకూడదో నిర్ణయించేటప్పుడు శాస్త్రప్రమాణాన్ని గైకొనాలి. అర్జునా! శాస్త్రమునందు చెప్పబడినదానిని తెలిసికొని దానిననుసరించి నీవీ ప్రపంచమున కర్మ చెయ్యి.

# భగవద్గీత
## 17వ అధ్యాయము
## శ్రద్ధాత్రయ విభాగయోగము

సుబ్బన్న - మామయ్యా! దైవాసుర సంపద్విభాగయోగాన్ని గూర్చి విపులంగా తెలిపిన తర్వాత శ్రీకృష్ణమూర్తి అర్జునకు ఏమి బోధించారు ?

గురవయ్య - సుబ్బన్నా ! తర్వాత శ్రీకృష్ణపరమాత్మ శ్రద్ధాత్రయవిభాగ యోగాన్ని గూర్చి చక్కగా బోధించారు. ఏ కార్యానికైనా శ్రద్ధ చాలా అవసరము. అశ్రద్ధ కలవానికి ఏ కార్యంలో కూడ విజయం చేకూరదు. శ్రద్ధను గూర్చి తెలుసుకొనదలంచి అర్జునుడు ముందుగా శ్రీకృష్ణుని ఈ విధంగా ప్రశ్నించాడు - కృష్ణా! ఎవరు శాస్త్రోక్త విధానమును విడిచిపెట్టి శ్రద్ధతో గూడుకొని పూజాదులనొనర్తురో వారియొక్క స్థితి సాత్త్వికమా, లేక రాజసమా, లేక తామసమా? తెలుపగోరుకాను.అర్జునుని ఆ ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణ పరమాత్మ ఇలా బోధించారు.

అర్జునా! శ్రద్ధ వారి వారి స్వభావము ననుసరించి సాత్త్వికము, రాజసమని, తామసమని 3 విధాలుగా వుంటుంది. సమస్త జీవులకును వారి వారి అంతఃకరణముననుసరించి శ్రద్ధ కలుగుతుంటుంది. ఎవడెట్టి శ్రద్ధ కలిగి వుంటాడో వాడా విధంగానే ప్రవర్తిస్తూంటాడు. సత్త్వగుణముగల వారు దేవతలను, రజోగుణముగలవారు యక్షులను, రాక్షసులను, తమోగుణము గలవారు భూతప్రేత గుణములను పూజిస్తుంటారు. ఎవరు శరీరమును శుష్కింపజేస్తూ దంభాహంకారములు గలవారై, కామము, రాగము, పశుబలము కలిగియుండి అవివేకము కలిగి శాస్త్రములందు విధింపబడనిదియు ఇతరులకు

బాధాకరమైనదియు అగు తపస్సును చేస్తూంటారో అట్టివారిని అసుర స్వభావము కలవారుగా తెలుసుకో.

అర్జునా! ఆహారము, యజ్ఞము, దానము, తపస్సు జనులకు 3 విధములుగా ఇష్టమగుచున్నవి. వాటిని గూర్చి చెప్తాను విను. ఆయుస్సును, మనోబలమును, దేహబలమును, ఆరోగ్యమును, సౌఖ్యమును, ప్రీతిని బాగుగా వృద్ధిగావించునదియు, రసము గలదియు, చమురు గలదియు, దేహమందు చాలా కాలముండునదియు, మనోహరములైనవియునగు ఆహారములు సత్త్వగుణము గలవారికి ఇష్టముగా వుంటాయి. ఇక చేదుగాను, పులుపుగాను, ఉప్పుగాను, మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురులేనివిగాను, మిగుల దాహము గలుగజేయునవిగాను ఉండునవియు, దుఃఖమును, వ్యాకులత్వమును గలుగజేయునదియునగు ఆహార పదార్థములు రజోగుణము గలవారికి ఇష్టములై వుంటాయి. ఇక వండిన పిమ్మట ఒక ఝామూదాటినదియు, సారము నశించినదియు, దుర్గంధము గలవియు, పాచిపోయినదియు, ఒకరు తినగా మిగిలినదియు, అశుద్ధముగా నున్నదియు అగు ఆహారము తమోగుణము కలవారికి ఇష్టమై యున్నది.

అర్జునా! ఫలాపేక్ష లేకుండా చేయబడు యజ్ఞము సాత్త్విక యజ్ఞమన బడుతుంది. ఫలములను కోరి డంబముతో చేయబడు యజ్ఞము రాజసమనబడుతుంది. విధ్యుక్తము కానిదియు, అన్నదానము లేనిదియు, మంత్రరహితమైనదియు, దక్షిణలేనిదియు, శ్రద్ధ బొత్తిగాలేనిదియును అగు యజ్ఞము తామస యజ్ఞమని చెప్పబడుతుంది.

అర్జునా! దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను పూజించుట, బాహ్యాభ్యంతర శుద్ధి గలిగియుండుట, ఋజుత్వముతో గూడియుండుట, బ్రహ్మచర్య వ్రతమును పాలించుట, ఏ ప్రాణిని హింసింపకుండుట, శారీరక తపస్సని చెప్పబడుతుంది. ఇతరుల.మన

స్సునకు బాధ గలిగింపనిదియు, సత్యమైనదియు, ప్రియమైనదియు, మేలు గలిగించునదియునగు వాక్యమును, వేదాదుల యొక్క అధ్యయనమును అభ్యసించుట వాచిక తపస్సని చెప్పబడుతుంది. మనస్సును నిర్మలముగా నుంచుట, ముఖ ప్రసన్నత్వము, పరమాత్మను గూర్చిన మననము గలిగియుండుట, (లేక దృశ్య సంకల్పము లెవ్వియు లేక ఆత్మయందే స్థితి కలిగియుండుట), మనస్సును బాగుగా నిగ్రహించుట, పరిశుద్ధమగు భావము కలిగియుండుట అనునివి మానసిక తపస్సని చెప్పబడుతుంది.

అర్జునా ఫలాపేక్ష లేనివారును, నిశ్చల చిత్తులున్ను అగు మనుజులచే అధికమగు శ్రద్ధతో ఆచరింపబడినట్టి ఆ మూడు విధములైన తపస్సులను సాత్త్విక తపస్సని చెప్పబడుతుంది. ఇతరులం చేత సత్కరింపబడవలెనని, గౌరవింపబడవలెనని, పూజింపబడవలెనని డంబముతో మాత్రమే చేయబడు తపస్సు అస్థిరమై, అనిశ్చితమైనట్టి ఫలముగలదై ఈ ప్రపంచమున రాజస తపస్సు అని చెప్పబడుతుంది. మూర్ఖపు పట్టుదలతో తన శరీరమును బాధించుకొనుట ద్వారాగాని, లేక ఇతరులను నాశనము చేయవలెనను ఉద్దేశ్యముతో గాని చేయబడు తపస్సు తామసిక తపస్సు అని చెప్పబడుతుంది.

అర్జునా ఇవ్వవలసినదే యను నిశ్చయముతో ఏదైనను పుణ్యప్రదేశమందును, పుణ్యకాలమందును, యోగ్యుడగు వానికి మరియు ప్రత్యుపకారము చేయశక్తి లేనివాకి కొరకు ఇవ్వబడుచున్నదో అది సాత్త్వక దానమని చెప్పబడుతుంది. ప్రత్యుపకారము కొరకుగాని లేక ఫలమునుద్దేశించి గాని లేక మనఃక్లేశముతోగాని ఇవ్వబడు దానము రాజసదానమని చెప్పబడుతుంది. దానమునకు తగని దేశకాలము లందును, పాత్రులు కాని వారికొరకును, సత్కార శూన్యముగాను, అమర్యాదతోను, ఇవ్వబడు దానము తామసదానమని చెప్పబడును.

అర్జునా! పరబ్రహ్మమునకు 'ఓమ్' అనియు ,'తత్' అనియు

,సత్ అనియు 3 విధములగు పేర్లు చెప్పబడినవి. ఈ త్రినామత్ర యము వలననే పూర్వము యజ్ఞములు, వేదములు నిర్మింపబడినవి. కావున వేదములను బాగుగా నెఱింగిన వారియొక్క శాస్త్రోక్తము లగు యజ్ఞదానతపః క్రియలన్నియు ఎల్లప్పుడును 'ఓమ్' అని చెప్పిన పిమ్మటనే అనుష్ఠింపబడుచున్నవి. అట్లే 'తత్' అను పదమును ఉచ్చరించియే ముముక్షువులు ఫలాపేక్షలేక పలువిధములైన యజ్ఞ దానతపః కర్మలను చేయుచున్నారు. 'కలదు' అనేది అర్థమందును 'మంచిది' అనేది అర్థమందును 'సత్' అను పదము కనబడుతుంది. యజ్ఞమునందును, తపస్సునందును, దానమునందునుగల నిష్ఠకూడ 'సత్' అని చెప్పబడుచున్నది. మరియు బ్రహ్మోద్దేశమైన కర్మలు కూడ 'సత్' అనియే పిలవబడుచున్నవి.

అర్జునా! ఏ కార్యమైనా శ్రద్ధతో చేయబడినపుడు మాత్రమే సత్ఫలితాలనిస్తుంది. అశ్రద్ధతో చేయబడిన హోమముగాని, దానము గాని, తపస్సు గాని, ఇతర కర్మలుగాని అసత్తని చెప్పబడుతవి. అవి ఇహలోక ఫలమునుగాని, పరలోక ఫలమునుగాని కలుగజేయవు.

# భగవద్గీత
# 18వ అధ్యాయము

## మోక్షసన్న్యాసయోగము

సుబ్బన్న - మామయ్యా ! శ్రద్ధాత్రయ విభాగయోగాన్ని గూర్చి వివరించి చెప్పిన తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునకు ఏమి బోధించారో తెలుపుతావా ?

గురవయ్య -సుబ్బన్నా! శ్రద్ధాత్రయాన్ని గూర్చి బోధించిన తరువాత భగవానుడు మోక్షసన్న్యాసయోగాన్ని విపులంగా తెలియజేశారు. సుబ్బన్నా! మోక్షమంటే విడుదల, బంధము నుండి విడుదల, సాంసారిక దుఃఖముల నుండి, జనన మరణముల నుండి విడుదల. అనగా బంధవిముక్తి యని భావం. అట్టి బంధవిమోచన రూపమగు కైవల్యము త్యాగముచేతనే లభిస్తుంది. త్యాగమన్నా, సన్న్యాసమన్నా రెండును ఒకటియే. త్యాగమంటే వాస్తవంగా దృశ్యాభావనా త్యాగము, సర్వసంగ పరిత్యాగము. ప్రపంచము, దేహము, మనస్సు ఇత్యాది సమస్త దృశ్యవస్తువుల యొక్క సంగమును పరిత్యజించి మోక్షరూపుడగు భగవంతు నొకరినే, ఆత్మవస్తువు నొక్కదానినే శరణు పొందాలి. దృశ్య వస్తు సంబంధమైన భావనయంతయు ఏ క్షణమున మనుజుడు త్యజించివేయునో ఆ క్షణముననే యాతడు దృగ్వస్తువగు ఆత్మగనే శేషిస్తాడు. అదియే మోక్షస్థితి. అంటే క్షేత్రమును త్యజించుటచే క్షేత్రజ్ఞుడు శేషించునని భావం. దృశ్యత్యాగముచే దృగ్రూపమగు మోక్షం లభిస్తుందని అర్థం. ఈ ప్రకారముగా సన్న్యాసము వలన, త్యాగమువలన, సర్వదృశ్య వస్తు సంగపరిత్యాగము వలన

మోక్షము లభించునని బోధింపబడిన అధ్యాయమగుట వలన దీనికి మోక్షసన్న్యాసయోగమను పేరు వచ్చింది.

సుబ్బన్నా! మోక్షసన్న్యాసానికి ఇంకో అర్థం వుంది. మోక్షమును సన్న్యసించుట, వదులుట మోక్ష సన్న్యాసము. ప్రతివారు మోక్షమును కోరువారే కాని వదలరు కదా అనిన, కోరునది యెవరు మోక్షమును కోరునది బంధమున నున్నవారే కావున బద్ధుడే ముక్తిని కోరుతాడు. కాని గీత 17 అధ్యాయములందు తెలుపబడిన అఖండమగు బోధను జీర్ణించుకొనిన వాడు బద్ధుడెట్లా అవుతాడు? నిత్యసత్య సనాతనమగు తన ఆత్మ నెరింగిన వానికిక బంధమెక్కడ ? బంధమేలేనపుడిక మోక్షమును గూర్చిన ప్రశ్నయే ఎచట? కాబట్టి అట్టి ముక్తస్థితిలో జీవుడు మోక్ష భావనను గూడ త్యజించి వేస్తాడు. ఏలయనిన అత్తటి తానే మోక్షరూపుడై వెల యును .కావున మోక్షమును గూర్చిన సంకల్పమే అతనికిలవసరము. అత్తటి మోక్ష సంకల్పము నతడు త్యజించి వేయువచ్చు. అదియే మోక్షసన్న్యాసము.

సుబ్బన్నా! శ్రద్ధాత్రయ విభాగయోగాన్ని గూర్చి వినిన తరువాత అర్జునునకు ఒక సందేహము కలిగింది. ఆ సందేహాన్ని తొలగించుకోవటానికై శ్రీకృష్ణుని ఇలా ప్రశ్నించాడు. కృష్ణా! సన్న్యాసము యొక్కయు, త్యాగము యొక్కయు యథార్థమును తెలిసికొన గోరుతున్నా దయచేసి తెలుప వేడెద. ఆ ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణ పరమాత్మ ఇలా ప్రత్యుత్తరమిచ్చారు. కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసమని కొందరు, సమస్త కర్మలయొక్క ఫలమును త్యజించుటయే త్యాగమని కొందరు చెపుతుంటారు. అర్జునా! యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మలు త్యజింపదగినవి కావు వాటిని తప్పకుండా చేయాలి. ఆ యజ్ఞదాన తపములు మనుష్యులను పవిత్రంగా చేస్తవి కావున వాటిని ఆసక్తిని, ఫలములను విడచి

జనులు చేయాలి. విధింపబడినట్టి కర్మము యొక్క పరిత్యాగము యుక్తముకాదు అజ్ఞానమనే అట్టి కర్మమును ఎవడైనా విడిచిపెట్టు నేని అది తామస త్యాగమే యగును. ఎవడు శరీర ప్రయాసవలన భయముచేత దుఃఖమును గలుగజేయునది యనియే తలంచి విధ్యుక్త కర్మమును విడిచిపెట్టునో, అట్టివాడు రాజస త్యాగమును గావించి నవాడై త్యాగఫలమును బొందనేరడు. ఇది చేయదగినదియే యని తలంచి శాస్త్రనియుతమగు ఏ కర్మలు అభిమానము, ఫలము విడిచి పెట్టబడి చేయబడుచున్నారో అట్టి త్యాగము సాత్త్విక త్యాగమని నిశ్చయింపబడింది.

అర్జునా! దేహధారియైన జీవుడెవడును కర్మములను పూర్తిగా విడుచుటకు సాధ్యముకాదు. ఎవడు కర్మల యొక్క ఫలమును విడుచుచున్నాడో అట్టి వాడే త్యాగియని పిలువబడుచున్నాడు. అర్జునా! ఎవడు నిరుపాధికుడగు ఆత్మను కర్తగా తలంచు చున్నాడో అట్టివాడు కర్మయొక్కగాని ఆత్మయొక్కగాని వాస్తవ స్వరూపమును ఎఱుంగుటలేదు. ఎవనికి "నేను కర్తను" అను తలంపు లేదో అతని యొక్క బుద్ధి విషయములను కర్మలను అంటదో అట్టివాడు ఎన్నడును బంధింపబడడు.

అర్జునా! వేరువేరుగావున్న సమస్త చరాచర ప్రాణులందును ఒక్కటైన నాశరహితమగు ఆత్మవస్తువును విభజింపబడక ఏక ముగా నున్నట్లు దేనివలన తెలిసికొనుచున్నడో అది సాత్త్విక జ్ఞానము. అట్లుకాక వేరువేరుగా చూచుట రాజస జ్ఞానము. తత్త్వమును తెలియక నుండునది తామస జ్ఞానము. ఫలాపేక్ష లేకుండా, రాగద్వేషములు లేకుండా చేయబడు కర్మ సాత్త్విక కర్మయనియు; ఫలాపేక్షతోను, అహంకారముతోను చేయబడు కర్మ రాజస కర్మయనియు; అనాలోచితముగా అవివేకముతో చేయబడునది తామసకర్మ యని చెప్పబడుతుంది.

నేను కర్తనను అను అభిమానములేక నిస్సంగముగ ఆచరించువాడు సాత్త్విక కర్తయనియు, అనురాగముతో కూడియు కర్మఫలమును వాంఛించువాడును,లోభియు, హింసాస్వభావము కలవాడును అగుమనుజుడు రాజస కర్తయనియు, మనోనిగ్రహము లేనివాడును, పామర స్వభావము కలవాడును, వినయము లేనివాడును, వంచకుడును,అగువాడు తామసకర్తయనియు చెప్పబడుతారు.

అర్జునా! ఏ బుద్ధి ధర్మమందు ప్రవృత్తిని, అధర్మమందు నివృత్తిని పొంది యుండునో అది సాత్త్విక బుద్ధియనియు, ఏ బుద్ధి చేత ఉన్నదానిని ఉన్నట్లుకాక మరి ఒక విధముగా భావించునో అది రాజస బుద్ధియనియు, అవివేకముచేత కప్పబడినదియు అధర్మమును ధర్మముగా భావించునదియు అగు బుద్ధి తామసబుద్ధియనియు పేర్కొనబడినది.

అర్జునా! నిశ్చలమైనదియు, ఇంద్రియ మనోనిగ్రహముతో కూడినదియు సాత్త్వికధైర్యమనియు; ఏ ధైర్యము చేత మనుజుడు ఫలాపేక్ష గలవాడై ధర్మార్థ కామములను మిగుల ఆసక్తితో అనుష్ఠించు చుండునో అట్టి ధైర్యము రాజస ధైర్యమనియు; దేనిచేత నిద్రను, భయమును, దుఃఖమును, సంతాపమును, మదమును, విడువక యుండునో అట్టి ధైర్యము తామస ధైర్యమనియు చెప్పబడుతుంది.

అర్జునా ! ఏ సుఖము ప్రారంభమునందు విషమువలెను, పర్యవసానమందు అమృతమువలెను వుండునో అట్టిది సాత్త్విక సుఖమనియు; ఏ సుఖము విషయేంద్రియ సంబంధము వలన మొదట అమృతమును బోలియు పర్యవసానమందు విషమువలెను వుండుచున్నదో అట్టిది రాజస సుఖమనియు; నిద్ర, సోమరితనము, ప్రమత్తత అనుదానివలన పుట్టినవియు, ఆరంభమందును అంతమందును మోహమును గలుగజేయునదియు అగుసుఖము తామస

సుఖమనియు చెప్పబడతవి.

అర్జునా! ప్రకృతినుండి పుట్టినవగు ఈ మూడు గుణము లతో గూడియుండని వస్తువీ భూలోకమునగాని, స్వర్గమందుగాని, దేవతలయందుగాని, ఎచటను లేదు. అర్జునా! బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వారివారి స్వభావము వలన పుట్టిన గుణములను బట్టి కర్మలు వేరువేరుగ ఏర్పడినవి. అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఋజుమార్గ వర్త నము, శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము, దైవమందు, గురువునందు, శాస్త్రమందు నమ్మకము కలిగి యుండుట ఇవి బ్రాహ్మణ స్వభావ ములు. శూరత్వము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధము నందు పారిపోకుండుట దానము, ప్రజా పరిపాలనా శక్తి ఇవి స్వభావము వలన పుట్టిన క్షత్రియ కర్మలై యున్నవి. వ్యవసాయము, గోసంరక్షణము, వర్తకము వైశ్యునకు స్వభావజనితములగు కర్మలై యున్నవి. సేవారూపమైన కర్మము శూద్రునకు స్వభావ సిద్ధమై యున్నది.

ఎవరిచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో ఎవరి వలన ప్రాణులకు ఉత్పత్తి మొదలైనవి కలుగుచున్నవో అట్టి భగవంతుని జనులు స్వకీయ కర్మలచే నారాధించి జ్ఞానయోగ్యతా రూపసిద్ధిని పొందుచున్నాడు. సమస్త విషయములందును తగులు బాటు నొందని బుద్ధిగలవాడును, మనస్సును జయించినవాడును, కోరికలు లేనివాడునగు మనుజుడు సంగత్యాగముచే సర్వోత్కృ ష్టమైన నిష్క్రియాత్మ స్థితిని పొందుచున్నాడు.

సుబ్బన్నా ! ఈ ప్రకారముగా శ్రీకృష్ణ పరమాత్మ అనేక ధర్మములను అర్జునునకు బోధించి తదుపరి గీతాసారమునంతను సంక్షేపముగా ఇట్లు తెలియజేశారు.

అతి నిర్మలమైన బుద్ధితో గూడిన వాడును, ధైర్యముతో మనస్సును నిగ్రహించువాడును, శబ్దస్పర్శాది విషయములను విడిచిపెట్టువాడును, రాగద్వేషములను పరిత్యజించువాడును, ఏకాంత
స్థలములందు నివసించువాడును, మితాహారమును సేవించు వాడును; వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనము చేసికొనిన వాడును, ఎల్లప్పుడు ధ్యానయోగ తత్పరుడై యుండువాడును, వైరాగ్యమును లెస్సగా నవలంభించినవాడును; అహంకారమును, బలమును, డంబమును, కామమును, క్రోధమును, వస్తు సంగ్రహణమును బాగుగా వదలివైచువాడును, మమకారము లేనివాడును, శాంతుడును అయి యుండువాడు బ్రహ్మస్వరూపమునొందుటకు సమర్థుడగుచున్నాడు.

బ్రహ్మస్వరూపమును బొందినవాడు, నిర్మలమైన మనస్సు గలవాడునగు మనుజుడు దేనిని గూర్చియు దుఃఖింపడు. దేనిని కోరడు. సమస్త ప్రాణులందును సమబుద్ధి కలవాడై భగవంతుని యందలి ఉత్తమ భక్తిని పొందుచున్నాడు. భక్తిచేత మనుజుడు భగవంతుని గూర్చి లెస్సగా తెలిసికొనుచున్నాడు. ఈ ప్రకారంగా భగవంతును గూర్చి తెలిసికొని భగవంతునితో ఐక్యమును పొందుతున్నాడు. నన్ను (ఆత్మను) ఆశ్రయించువాడు నా అనుగ్రహము వలన శాశ్వతమగు మోక్షపదమును పొందుతాడు. అర్జునా! ఏకాగ్రచిత్తుడవై పరమాత్మనే ధ్యానించు. తత్త్వవిచారణ చెయ్యి. దైవమునందు చిత్తమును నిలుపువాడు దైవానుగ్రహము వలన సమస్త దుఃఖములనుండి విడవడతాడు.

అర్జునా ! జగన్నియామకుడగు పరమేశ్వరుడు మాయచేత సమస్త ప్రాణులను యంత్రము నారోహించిన వారిని వలె త్రిప్పుచు సమస్త ప్రాణులయొక్క హృదయమున వెలయుచున్నారు.

సర్వవిధముల ఆ ఈశ్వరునే శరణు బొందుము. వారి అనుగ్రహ
ముచే సర్వోత్తమమగు శాంతిని, శాశ్వతమగు మోక్షపదవిని నీవు
పొందగలవు.

అర్జునా ! ఈ విధంగా పరమ రహస్యమైన ఆధ్యాత్మిక
తత్త్వములను నీకు చెప్పినాను. దానినంతను బాగా విచారణ
చేసి తదుపరి నీకెట్లిష్టమో అట్లాచరించు. అర్జునా! నాయందు
మనస్సు నిలుపు, నాయందు భక్తి కలిగియుండు అప్పుడు నన్నే
పొందగలవు. నీవు నాకిష్టుడవు కాబట్టి ఈ ప్రకారముగా ప్రతిజ్ఞ
చేసి చెపుతున్నాను. ఇతర విషయములన్నిటిని త్యజించి నైచి నన్నొ
కనినే ఆశ్రయించు నా అనుగ్రహము వలన శాంతిదాయకమును,
శాశ్వతమునగు స్థానమును పొందగలవు.

అర్జునా! ఈ గీతాశాస్త్రాన్ని భక్తి విశ్వాసములు లేని వారికి
,వినుటకు ఇష్టము లేనివానికిని బోధింపకూడదు.

సుబ్బన్నా, ఈ గీతాశాస్త్రమునంతను బోధించిన తర్వాత
గీతను ఇతరులకు తెలిపి గీతాప్రచారము గావించుట మంచిదని
భగవానుడు ఈ ప్రకారంగా తెలియజేశారు. అర్జునా! ఎవడు
అతి రహస్యమైన గీతా శాస్త్రమును నా భక్తులకు ఉపదేసించునో
అతడు నన్నే పొందుతాడు. అట్టివాడు నాకు పరమప్రీతిపాత్రుడు.
అర్జునా! శ్రద్ధ కలిగి ఎవరీ గీతాబోధను శ్రవణం చేస్తారో అట్టివారు
పాపవిముక్తులై పుణ్యలోకాలను పొందుతారు. అర్జునా! ఈ బోధను
నీవు ఏకాగ్రంగా విన్నావా? నీ అజ్ఞానం నశించినదా?.

సుబ్బన్నా! శ్రీకృష్ణుని ఆ ప్రశ్నను పురస్కరించుకొని అర్జును
డిలా తెలిపాడు - కృష్ణా ! మీ యనుగ్రహము చేత నా యజ్ఞానము
నశించినది. జ్ఞానము కలిగింది. సందేహము పటాపంచలై పోయినది.
ఇక మీ యాజ్ఞను తప్పకుండా నెరవేరుస్తా.

సుబ్బన్నా! వ్యాసమహర్షి అనుగ్రహించే యుద్ధములో జరిగిన విషయములన్నిటిని తెలిసికొనగలిగిన సంజయుడు ధృతరాష్ట్రునకి ప్రకారంగా చెప్పాడు. మహారాజా! ఈ విధంగా నేను అద్భుతమైన ఈ కృష్ణార్జున సంవాదమును విని పరమానంద భరితుడనైతిని. ఆశ్చర్యకరమైన విశ్వరూపాన్ని దర్శించినందున నాకు ఆనందము పొంగి పొర్లుతోంది. మహారాజా! ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడుండునో ఎచట భక్తుడగు అర్జునుడుండునో, అచట సంపదయు, విజయమున్ను, ఐశ్వర్యమున్ను, దృఢమగు నీతియు వుండునని నా అభిప్రాయము.

సుబ్బన్నా ! ఇప్పుడు గీతాబోధ సమాప్తమైంది. దీనిని విన్న తరువాత నీకెట్టి అనుభవం కలుగుతుందో చెప్పు.

సుబ్బన్న - నా సంతోషానికి అవధులు లేవు. నేను ధన్యుడనైనాను. అమృతతుల్యమగు ఇట్టి బోధను వినుటకు అవకాశము కలిగినందులకు నేను పరమానందము పొందుతున్నాను. ఈ బోధనంతను ఆచరణలో పెట్టి తరించటానికై తీవ్రమైన కృషి చేస్తాను. సెలవు.!

హరిః ఓమ్ తత్సత్